శ్రీరస్తు.

---

శ్రీమద్వృత్షాధ్యక్షవతంసాత్మయ కరుణాకటాక్ష వీక్షణ
సంలబ్ధహృద్యానవద్యపద్యగద్యాత్మిక బంధుర ప్రబంధ
రచనాధుర్యుండగు శేషనాధార్యవర్య విరచిత

# శ్రీమత్పర్వతమాహాత్మ్యము

ఇది

సాధనచతుష్టయసంపత్తిగల ముముక్షువుల కత్యంతోప
యుక్తమగునని యెంచి కాంచీమండలములో జేరిన
యవళూరుశ్రోత్రియగ్రామనివాసుండును అమ్మనమంచి
వంశకలశాంభోధి జైవాతృకుండును శ్రీవత్ససగోత్రుండు
ను ఆపస్తంభ సూత్రుండును సుబ్రహ్మణ్యార్య
సుపుత్రుండునునగు.

## రామచంద్రయ్యగారు

ధనవినియోగ పూర్వకముగాఁ బ్రేరేపింపఁ
దత్సహాయంబున

## చెదలవాడ * సుందరరామశాస్త్రులచే

సరిచూడఁబడి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె.

చెన్నపట్టణం

విరోధి సం.

శ్రీరస్తు.

## ద్వాదశపదశార్దూలవృత్తమాలిక.

శ్రీమచ్ఛంకరభక్తశేఖరుఁడు కాంచీమండలస్థావళీ। నాఁ
మశ్రోత్రియ పూర్ణివాసుఁడు హృదానందైక సాంబ్రాజ్యసు।
త్రాముండమ్మనమంచి వంశజుఁడు సుబ్రహ్మణ్యాధీవర్యాగ।భాషాం
డాంబుధి రోహిణీప్రియుఁడు శ్రీవత్సర్షిగోత్రోదయుం।డామో
దస్థిరపుణ్యకర్మనిరతుండంభోజకుంజేందువా। ణీమందారసు
రద్రుమవిష్ణుపది డిండీరస్ఫురత్సద్యశః। శ్రీమాన్యుం డతిశాంతమా
నసికుఁడౌ శ్రీరామచంద్రాఖ్యుఁడు। ద్దామప్రోజ్జ్వలశాలివాహ
నశకాబ్దంబుల్ పురైకాష్టభూ। నామోక్తంబగుసంఖ్యలన్నడువ
నానాగణ్యపుణ్యాపద శ్రీమచ్ఛ్రీగిరిసత్పురాణమును ముద్రిం
పించి సంప్రీతితో। భూమిన్ గోవిదులౌ ననంగఁ బ్రచురం
బున్ జేసెఁ దత్కావ్యమా। సోమార్క-స్థితమై ప్రసిద్ధియగు
తన్ శోభాయమానంబుగన్॥ *

శ్రీ ర స్తు.

# ప్రకటన.

శ్రీమదుమారమణ విమలచరణారవింద నిష్యందమకరంద బిందు పాన తుందిలేందిందిరాయమాన మానసులగు భక్తాగ్రగణ్యులకు ప్ర న్నననే విన్నవించునది యెట్లనిన- శ్రీమదఖండాద్వితీయ నిర్గుణనిర్వికా ర నిరతిశయాప్రమేయ నిరంజనప్రత్యగభిన్న పూర్ణసత్య జ్ఞానానంత స్వరూప పరమాత్మా రోపితాత్మ శక్తివలన పంచభూతాత్మిక త్రిగు ణాన్విత దృష్టప్రపంచంబు సృష్టంబయ్యె- నది- జరాయుజాండజ స్వేద జోద్భిజ్జంబుల నజతుర్విధంబుల బరిణమించె. నవియు - స్థావరములన- జంగమములన- రెండు తెఱంగులం జెలంగె- నందుజంగమప్రపంచంబు- కీ టకాద్యనంత జంతుసంతానంబుల నవతరించిసంతాపంబు నొందుచుం డ- (దుర్లభోమానుషోదేహః) అను వచనప్రకార మనేకజన్మార్జిత భాగ్య పుణ్య పుంజ పరిపాకంబువలన- మానుషశరీరం బలవడు- న ద్దానియందనాద్యజ్ఞానవశంబున ననర్గళాపవర్గమార్గంబుగన నేర క కాలక్రమంబునగు లాలచక్రంబువలె- దిరుగు పశుభార్యాపుత్రమిత్ర క ళత్ర క్షేత్రాద్యపారసంసారపారావారంబు నందగులువడితీరంబుజేరు దారియెఱుంగక తత్పోషణంబుకొఱకు యాచ్ఞా వాణిజ్య సేవకాద్యధ మవృత్తులంగీకరించి- యదియె పరమసుఖంబుగా నెంచుచు నంతిమంబు న నంతకశాసనంబున ననంతదురంత చింతాసమన్విత- స్వాంతులగుచు కుంభీపాకాసి పత్రదారు యంత్ర మహారౌరవాదినరకంబులనుభవించి క్రిమ్మఱ దండధరానుమతంబున పురాకృత కర్మసహాయంబుచే వసుం ధరయందుదయింపుచు నుందురు- ఇట్టిచో ననుభవంబులగుబాల్యకౌమా రాది దశావిశేషంబులువాక్రుచ్చనాతరంబె- జీవులకిట్టి జన్మంబులిన్నియ ని యెన్నుటకు బన్నగాధిపునకైన వశంబగునా॥ ఈవిషయమెల్ల ర

యుల్లంజీవులకు దుర్లభంబేకదా జన్మంబులకునెల్ల నుత్తమజన్మయగు మా
నుషజన్మం బెత్తినందుకు స్వోదరపూరణమునకై - యేయే కార్యంబు లా
చరింపుచుండినను - (దేహికి - దేహావసానపర్యంతంబు నారాయణచరణా
రవిందసేవనంబు కర్తవ్యంబు) అను భాగవత వాక్యప్రకారము సత్సహ
వాసమును - గురు బ్రాహ్మణ విశ్వాసంబును - దేవతాభక్తియు - సర్వకా
లంబుల గలిగియుండవలయు - నట్టిభక్తిం జేసి జ్ఞానంబును జ్ఞానముంబ
ట్టి వైరాగ్యంబును - వైరాగ్యమువలన ముక్తియును లభించును - ఇటుల
శ్రమించినవారు పునరావృత్తిరహిత సాయుజ్యసుఖంబు లనుభవించు
టకు సందియంబు లేదు - కావున నిట్టి జీవన్ముక్తికి బ్రధానసాధనంబగు భ
క్తి సదాయవలంబించి సమస్త పుణ్యతీర్థావగాహంబును - సమస్తదే
వతాదర్శనంబును - భగవద్విలాస లాలితకథాకల్పిత పురాణశ్రవణం
బును గావింపవలయు - కాశీ - గయా ప్రయాగావంతి ద్వారక హరి
ద్వార గోకర్ణ విరూపాక్ష - శ్రీశైలాహోబిల తిరుమల కంచి శ్రీరం
గ మధుర రామేశ్వరాది పుణ్యక్షేత్రంబు లక్కడక్కడ లెక్కకుమిక్కు
టమై - పెక్కులుగలవు - ఇవన్నియు పారిహారమయంబులై సాక్షాన్మో
క్షదాయకంబులై యుండినను - దర్శనమాత్ర విచ్ఛేదన పాపజాలంబు
ను - శ్రీమద్భ్రమరాంబాసమేత మల్లికార్జున విహారానుకూలంబును -
నగు శ్రీశైలంబు వీనికన్నిటికన్న మిన్నయైయున్నది - అయినను - నిమ్నో
న్నత శైలమధ్యప్రదేశమార్గ సంసర్గంబును - వరాహఖడ్గవ్యాఘ్ర
భల్లుకాద్యనేక దుష్టమృగావశిష్టంబును - నిర్మానుష్యప్రదేశంబును - చో
ర సమాకీర్ణంబును నగుటను - సమస్తవస్తు సంభారంబులు - ప్రశస్తం
బుగా లభింపమిని - యాత్రార్థులకు నత్యంతకష్టసాధ్యంబై మాఘచై
త్రమాసములయందు బరంపరాజరుగుచుండు నుత్సవసమయములందు
తక్కిన దక్షిణాకాలంబుల నమ్మంకటి చక్కటికేగుటకు శక్యంబుగాక
యున్నది గాని - యందలి దేవతా తీర్థసందోహంబుల ముక్తిప్ర
దాయకంబులై యున్నవి - ఇందుకు బ్రమాణమే తత్పురాణమందు (శ్రీ
శైలస్య సమం క్షేత్రం నభూతో నభవిష్యతి । శ్రీపర్వతసమం క్షేత్రం

హా స్త్రీత్యాభ్రూణతేనరః । బ్రహ్మహత్యసమంపాపం సంప్రాప్నోతిన సంశయః । కేదారస్యోదకంపీత్వా వారణస్యామృత స్తథా । శ్రీశైలే శిఖరందృష్ట్వా పునర్జన్మంనవిద్యతే) ఇదిగాక=యునాదికాలంబున శిలాదుండనుమాని యనేకసంవత్సరంబు లిందుధరునిఁగూర్చి తపంబాచరించిన నతనికి నీశుండుప్రత్యక్షంబై యతనికోరికప్రకారము పర్వతినందీశ్వరులను పుత్రులనొసంగెనందు నందీశ్వరుం డత్యంతతపంబున నభవు మెప్పించి యమ్మహనీయునకు వాహనంబై ప్రమథగణములలో నొకండుగా నియమింపఁబడియె నతండు తపంబాచరించిన స్థలంబు నందిమండలమనఁ బేర్కొనఁబడె- బదంపడి పర్వతుండు సహా శివునిగురించి ఘోరతపంబుఁగావించిన మెచ్చి తత్క్షణంబున ఫాలాక్షుండు ప్రత్యక్షంబై వానియభీష్టప్రకారము కైలాసాది మహాచలసంసర్గంబు నిర్గమించి భగుర్దందు పర్వతాగ్రంబున నావిర్భవించె- నట్లుదయించిన లింగంబు పర్వతలింగమనఁ బ్రఖ్యాతినొందె మహాదేవసంయుక్తంబగు నప్పర్వతదర్శనంబుచేసిన మానవులు పునర్జన్మరహితులయ్యెదరు- అట్లు పర్వతునివలన వరంబుకోరబడియె- అనంతరమందు వసుమతియను మునికన్నియ యున్నగంబున విరించినిగురించితపంబుఁగావించిననతండుసాక్షాత్కరించివరంబులడుగుమనిననాయమ-వసుమతియనునామంబుపరిహరించిశుభసరూపనామంబొందుదయచేయుమనినవల్లెయనివాణీశుండు-శ్రీయనునామంబొసంగియదృశ్యుండయ్యెనదిమొదలామె-శ్రీదేవియనుపేరఁబరఁగి పర్వతలింగంబును బూజింపుచుండె నట్టిశ్రీదేవి తపంబుసల్పిన స్థలంబుగావున నాశైలంబు శ్రీశైలమనవొప్పె నాసమీపమందుండు పట్టణమందు వసించి ప్రజాపాలనంబుసేయుచున్న చంద్రగుప్త మహారాజువలన నందాలయంబు నిర్మింపబడియె - నతనిపుత్రికయగు చంద్రవతియను కన్నియ - ఆలింగమునుగూర్చి తపంబొనరించిననకరఁడనున్న మల్లికాకుసుమసమన్వితంబగు కుండమందు ఖండేందుధరుడు ప్రసన్నుడై- మల్లికాస్రజంబులు తలయందుధరించిన నప్పటినుండి మల్లికార్జునుడను నామంబీశునకు బ్రసిద్ధంబయ్యె - నత్తీర్థంబున

శ్రీశైలఖండమననొప్పు- నీవృత్తాంత మీస్థలపురాణమందు బరిశీలించిన స
విస్తరంబుగ దెలియనగు- మఱియు- శ్రీశైలాది శేషాచలపర్యంతము- అ
చ్చటచ్చట ననేకతీర్థములు పార్థివములు కలిగియున్నియు- సాక్షాచ్ఛి
వమయములై పుణ్యప్రదములై యున్నవి. దీనికి దక్షిణద్వారము పినాకి
నీనదీతీర సిద్ధవటమనిన్ని- పశ్చిమద్వార తుంగభద్రానదీతీరా లంపూర
నిన్ని- ఉత్తరద్వారము కృష్ణానదీతీరై లేశ్వరమనిన్ని- ప్రాగ్ద్వారము గుం
డికానదీతీర త్రిపురాంతకమనిన్ని- పురాణప్రసిద్ధమై యున్నది. శ్రీశైల
ప్రదక్షిణము చేయ సమకట్టు పుణ్యాత్ము లీచతుర్ద్వారముద్రిత
మధ్యక్షేత్రముల సందర్శించుచు తీర్థంబుల గ్రుంకుచు- దిరుగవలసినట్లు
ప్రదక్షిణాధ్యాయమునందు జెప్పంబడినది- నింతవిస్తీర్ణముగలిగిన మ
హాస్థలంబెందును గానము॥ ఇందుకు బురాణమందు- (త్రింశద్యోజనవి
స్తీర్ణం త్రింశద్యోజనమాయతం। పర్వతంయోజనోత్సేధం విద్ధిసర్వత్ర
పార్వతి। శతకోటిసహస్రైస్తు లింగైస్సర్వత్రశోభితం। శతకోటిసహ
స్రైశ్చ దేవరూపైర్విరాజితం। అనేకదిశసంకీర్ణం నదీకోటిసమాకు
లం। చతుర్ద్వారసమాయుక్తం సర్వోపధవిరాజితం। దివ్యౌషధైశ్చ
వైషజ్యైదనేకైః పరిశోభితం। నానాస్పర్శశిలాభిశ్చ జ్వలంతీభిర్విచిత్ర
తం) అని యిటుల లోకప్రసిద్ధమై సద్యోముక్తి ఫలకారణంబై యున్న
యీ క్షేత్రమును సందర్శింపవచ్చి- ఇక్ష్వాకు- శ్రీరామ- ధర్మరాజ-వి
క్రమార్కాది మహారాజులు- ఆయాయుగంబులయందు వారివారికిదో
చినపగిది గోపురప్రాకారాదికంబులు నిర్మింపించిరి- ఇటీవల- అనవే
మారెడ్డి గారు- తదాలయప్రాకారాదులపై బంగారుసీరుపోయించిరి-పి
దపకృష్ణదేవరాయలు- గోనబుద్ధారెడ్డి- అక్కన్నమాదన్నగార్లవల్ల
కొన్నికొన్ని పనులుచేయించబడియె- చందులాలాగారు సోపానములు
సహా కట్టించిరి- ముందొకసారి యిందుధనమున్నది గ్రహింపవలయును
అని తుకరాసచివుడను నొకదుర్మార్గుడు తనపరివారయుతముగా వ
చ్చి ఆలయములో త్రవ్వింపుచుండిన నందుదపంబుచేయుచుండు నొకకవి
గ్రామణి- విషమాక్షరప్రయోగముచేసి (మునుపొకకేల రావణుడు మో

దముసం రజతాద్రిహై త్రినగ౦॥ తనె హారుజప్పుడే తనవదంబునద్రోహి-
మదంబడంచెగా । ధనమయుగారి తుక్కు-సచివాయుల (శ్రీగిరి గర్ణపార
ల్క౯। గనబుభ్రుఁడ్రివ్వి సర్వమును గై కొనవీకిపుడాతడోపడే॥) అనుపద్య
ము చెప్పినవాడు మడసెనట- తక్కినవారు భయపడపాఱిరట- ఇప్పటికి
షుమారు ౩౦ సంవత్సరములక్రిందట- అరబ్బీలు వచ్చి యచ్చట ద్రవ్యము
న్నది చేకొనవలయునని కొన్ని కొన్నిస్థలములకు చెరుపుకలుగజేసిరిగాని
తన్మహాత్మ్యమువలన వారియభిమతము నెరవేరదయ్యె- ఇమ్మహాస్థలము
నకు ధర్మాధికారము శ్రీమచ్ఛంకరాచార్యస్వామివారిదై యున్నది - అ
క్కడ ఉత్సవాదికార్యములుజరుపుటకుగాను వారివల్ల గొందఱుకంట్రా
క్టుపొంది స్వార్జితముచేయుటయేగానియక్కడజరుగులోపాలోపము
లు బాగుపఱచరైరి- ఇప్పుడాధికారము - శ్రీమదచ్యుతస్వామివారు
పొంది యక్కడఁ వచ్చుద్రవ్యములో కొద్దిగా పనులుచేయించుచున్నా
రు। ఇట్టి పురాతనపుణ్యస్థల మహిమలు పార్వతీదేవికి బరమేశ్వరుడు చె
ప్పెనంత సనత్కుమారుండనుమునివిని వేదవ్యాసుల కుపదేశించె నమ్మ
హనీయుండష్టాదశపురాణములు రచించుచు దీనినిసహా రచియించిరి ఇది
స్కాందపురాణాంతర్గతమై శ్రీశైలఖండమని పేర్కొనబడి అరువదినా
లుగధ్యాయములుకలదైయున్నది- ఇట్టి వేదవ్యాసప్రోక్తమై- పఠనశ్రవణ
మాత్ర నిశ్శ్రేయసప్రాప్తిహేతువైయున్న ప్రబంధంబు- ముద్రాక్షరాం
కితము కాకుండుటంబట్టి. యెల్లరకువెల్లడికాదయ్యె. ఇదివారికి లభించిన
దికాదు. ఈపర్వతప్రాంత గ్రామములయందు. కొన్నిచోట్ల తాళప
త్రలిఖితమై బహుగోప్యముగానుంచబడినదిగాని. అంతటను లేదు. అట్టి
గ్రంథము నేనొకకూటియార్జించి లేఖకప్రమాదాది దోషంబులులేకుం
డ బరిష్కరింపించి ముద్రింపించుచున్నాడను. అచ్చుముగియుటతోడనే
ప్రచురింపఁబడును. దానిని యథాయుక్తముగా బరిశీలించి పఠన గా
వించిన దన్మహిమలు గరతలామలకముగాగలవు. ఇదిముద్రింపించుటకు
గాను నావల్ల వ్రయపడిన ద్రవ్యమునకు సరిపడేక్రియముతోటే యువ్వ
బడును గానవలయువారలు కాంక్షమూలముగా నాకువ్రాసి తెప్పించు
కొనవలయును.

ఇదిగాక మాఘకృష్ణచతుర్దశీశివరాత్రికి తత్సేవాపరతంత్రులై
వచ్చుబ్రాహ్మణాదిజనంబులు పోవునప్పుడు వచ్చునప్పుడు మార్గమధ్య

మందుదవ్యాలోపముచేతఁ బదార్థాలోపముచేతఁ ద్రికరణలోపముచేత బహాయాసముచేతనన్నపానాదికములకుమిక్కిలికష్టించుచున్నందున నట్టిస్థళమందుతీర్థికసౌఖ్యముకొరకు నేనారోజులలోసత్రమొకటియేర్పరిచి అన్నపానములు చక్కగాజరిపించునటుల గొంతయేర్పాటుచేసియుంటిని-యీశ్వరకృపవల్ల నారంభించినదిమొదలింతపర్యంతమది నిర్విఘ్నముగానెరవేరుచున్నది. అయినను-యిమ్మహత్కార్యము బహుకాలముజరుగునటుల జేయుటకును-స్వామియాలయమందుఁ బ్రస్తుతము నష్టపడినపనినికొంతవరకుబాగుపరచుటకును-నాకుసంకల్పముకలిగియుండినను స్వల్పజీవస్థుఁడనుభారికుటుంబీకుఁడను-అయినందున దగినద్రవ్యోపపత్తి లేకయున్నది- కాబట్టి యీపత్రికను చిత్తగించిన సత్పురుషులందరు పుణ్యసాధకమైన యీకార్యమును శిరసావహించివారివారికి నీశ్వరప్రేరణయయినమట్టుకు మానసోత్సాహముగా సహాయముచేసి యీయ ఫలమును బొందవలయునని ప్రార్థించెదను.

ఈస్థళమందు త్రికరణశుద్ధిగా యత్కించద్వినియోగముచేసిన నా ఫలమనంతమై యుంచున్నది. సందియములేదు॥ పురాణమందు॥

(వటబీజవదుత్పన్న మనంతఫలదాయకం। ప్రయాగేభోజయేద్యస్తు లక్షసంఖ్యాద్విజోత్తమాన్। గ్రాసేనైకేనతత్పుణ్యం శ్రీగిరౌలభతే నరః। వారాణస్యాంయదాప్నోతి ద్విలక్షబ్రహ్మభోజనం। గ్రాసేనైకేనదత్తేన శ్రీగిరౌతత్ఫలంలభేత్ । గంగాయాంసప్తలక్షాణాం బ్రాహ్మణానాంచభోజనాత్। యత్ఫలంతదవాప్నోతి శ్రీశైలేగ్రాసమాత్రతః। ప్రయాగేలక్షభోజ్యంస్యాత్సమంకాశ్యాద్విలక్షకం। గయాయాంసప్తలక్షంచ గ్రాసమేకంతుశ్రీగిరౌ। తత్రయస్తత్యజేద్దేహం అంత్యజాతిస నరోత్తమః। స్మరంచేతసిసర్వేశం భక్త్యాశ్రీమల్లికార్జునం॥)

ఇత్యాదిప్రమాణములు చక్కగాగమనించగోరెదను.

---

ఇట్లు-తమవిధేయుడు.
అమ్మన మంచిరామచంద్రయ్యా
కంభంతాలూకా గుమాస్తా.

సమాప్తము.

## విషయసూచిక.

### ప్రథమాశ్వాసము.



### —(*) ద్వితీయాశ్వాసము. (*)—

## విషయసూచిక.

—(*)షష్ఠమాశ్వాసము.(*)—



విషయసూచిక సమాప్తము.





శ్రీ ర స్తు.

శ్రీశైల మల్లికార్జునస్వామినే నమః. 1-- 6

అవిఘ్నమస్తు.

## శ్రీ మ త్ప ర్వ త పు రా ణ ము * ప ద్య కా వ్య ము.

శా॥ శ్రీమత్పర్వతరాజరాజ్యపదవీసింహాసనస్థు౯ జగ।ద్గ్రామగ్రామణి మల్లికార్జును నపాంగవ్యాప్తి లోకక్రియా। సామర్థ్యు౯ దుహితాద్రిజాకుచతటీసందీప్తకాశ్మీరసాం। ద్రామోదాన్వితవామభాగు శివు నారాధింతు డెందంబున౯॥ (శా) లాలిత్యంబు ననంతకోటిమదనాలంకార ధిక్కారమై। ప్రాలేయాద్రిజకు౯ ముదం బొసఁగఁగాఁ బాతాళగంగానదీ।ఖేలోత్తుంగతరంగసంగతజలక్రీడాకళాడంబర। శ్రీల౯ జెంది సుఖించు దేవుఁ గొలుతు౯ శ్రీపర్వతాధీశ్వరు౯॥ (శా) హస్తాలంకృతపన్నగేశ్వరసుధాహారావళీమస్తక। న్యస్తవ్యస్తకిరీటరత్ననివహాస్యాంచత్పదాంభోరుహు౯। విస్తారాంబుజసంభవాండనిబహావిర్భావగర్భార్ణవహు౯। శస్తాకారు సమస్తలోకగురు శ్రీశైలేశ్వరు౯ గొల్చెద౯॥ (శా) అల్లోనేరెడుపండువోలె నరచే నత్యుగ్రకాకోలము౯। బొల్లాసంబున నిల్పి గ్రుక్కఁగొని విస్ఫూర్జత్ప్రతాపంబుతో। ముల్లోకంబుల నేలుచున్న విభుని౯ మూర్ధేందుచూడామణి౯। దల్లిం దండ్రియునై జగంబునకు నుద్యన్మూర్తిఁ గీర్తించెద౯॥ (ఉ) తత్తఱపాటుతో నిరులు దద్దయు నాన్పఁగఁ జాలు కన్నను। వ్వొత్తున వెల్వు పూఁకలకు విందులు పెట్టెడుకన్నుదమ్మియు౯। మొత్తమినత్తలచ్చికిని మున్నుగఁ బుట్టిన ముద్దుపట్టిమే। నెత్తిలఁజూచు కన్నుగల యొట్టిడి వేలుపుఁ గొల్తు నిచ్చలు౯॥ (మ) శుభవాజుల్ సకిలింపఁ బ్రాఁజదువులై శోభిల్లఁగాఁ జేరి పైరభసక్రీడఁ బసిండి సింగిణి కళల్ రంజిల్లఁగాఁ గౌస్తుభ ప్రభల న్మించినచేయు న

దను. (నడిచి మీఁదు చూచి) అహో! శరత్కాలపుటెండ ఎంత తీక్ష్ణముగా నున్నది. ఎట్లన, ఇవ్విధమున నానాశోకములచే క్రాఁగుచున్న నాకును కడువేంద్రముగా తెలియ వగుచున్నది. [అని నిష్క్రమించును.

తే. తలఁగి ఘనబంధనంబును దరిణి యితఁడు
కన్నెను గ్రహించి పయితులం జెన్నుమీఱి
ఆత్మధామంబు వెండియు నధిగమించి
తేజరిల్లెడుఁ గడు వత్సరాజుపగిది. ౫.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

తద్భక్తిసం । భావజ్ఞానసుధానుభావరతుఁగా భావింపు మల్లీశ్వరా॥
(మ) శివచారిత్రము బీజ మంకురము నీసేవావివేకంబు స । త్కవితా
శ్రేణులు పల్లవంబులు సమాఖ్యావార్తముల్ పుష్పముల్ । భవదీయ స్త
వముల్ ఫలావలులు తద్భావజ్ఞులే కీరముల్ । భువి మత్కావ్యమహీ
రుహంబునకు శ్రీభూభృత్సుతాధీశ్వరా॥ (మ) భవదీయ స్తవ మెట్టు
లొప్ప నగు మత్ప్రాగల్భ్య మెట్లంచు నే । వివశత్వంబున శంక నొం
దుదును సంవిద్భక్తి బోధించి యు । త్సవభావంబున శంక మాన్చి మృ
దులస్ఫారార్థవాగ్వైఖరీ । నవపద్యవ్రజ పుష్పమాలికల నిన్నర్పిం
తు మల్లీశ్వరా॥ (సీసము) వర్ణింపఁగంటి దుర్వచనమార్గము దాఁటి
కమనీయశివకథాకథనమహిమఁ । బ్రణుతింపఁ గంటి దుర్భవమహాభ
ము గెల్చి శ్రీకంధిసీధరశిఖరమహిమ । గణుతింపఁ గంటి దుష్కలుష
పంకము వోవ నంబికాధవు సుపాఖ్యానమహిమ । వినుతింపఁ గంటి
వివేకపద్ధతిఁ గాంచి భూధరేశ్వరమూర్తి పుణ్యమహిమఁ । జాల ధ
న్యుండ నైతి సంశయము లేదు । భక్తిపుంగవు శ్రీగిరిఁ బ్రస్తుతింపఁ ।
గంటి శ్రీమల్లికార్జునకరుణ నాకు । సంభవించెను జన్మంబు సఫల మ
య్యె॥ (క) శివజన్ముఁడ శివగోత్రుఁడ । శివలింగధ్యానపరుఁడ శీలవ్ర
తుఁడన్ । శివపూజాపరతంత్రుఁడ । శివయోగసుధానుభవుఁడ శేషా
ఖ్యాయుఁడన్॥ (మ) ప్రణుతశ్రీగిరినాథలబ్ధకవితాప్రజ్ఞాకలాభిజ్ఞుఁ
డన్ । గణఘుగ్గ్రంధమతప్రయోగవిలుఠద్గాథార్థవేత్తృలస । త్ఫణి

—(*) గ్రంథప్రశంస. (*)—

భాషాయుతభక్తికావ్యపదప్రౌఢసమాసోచిత । ప్రణిపత్తిస్ఫుటశబ్ద
శాస్త్రనివహప్రావీణ్యపారీణుఁడన్॥ (ఉ) శ్రీగిరినాథు సన్మహిమఁ
జెప్ప నశక్యము బ్రహ్మకైన భూ । భాగములోని మానవులు ప్రస్తు
తి సేయఁగ నెట్లు నేతు నా । సాగరవిశ్రుతోన్నతులు చర్చలు చే
సినఁ జెప్పనేర్తునే । సాగరమంతె కాక యొక సారి తటాకముఁ బో
ల్పఁ గూడునే॥ (క) లలిత శ్రీగిరిమహిమల । చెలువము లాక

నోర నొకఁడు చెప్పంగలఁడే । యల రెండు వేల జిహ్వలు । గలి
గిన శేషునకు నెన్నఁగడు దుర్లభముల్॥ (శా) ముఖ్యార్థోచిత
సూక్తులన్ మెఱయుచున్ మోదించి వాణీ సదా। సౌఖ్యశ్రీనిధి మల్లికా
ర్జునగురుస్వామిన్ బ్రశంసించెదన్ । బ్రఖ్యాతోజ్జ్వలమస్తకాగ్రకుట
జప్రద్యోతితస్వర్ణదీ । సఖ్యశ్వేతకళాకలాప శశభృత్సమ్యగ్జటాజూ
టునిన్॥ (వ) అని ప్రబంధకల్పనారంభకలనాయత్తచిత్తుండనై॥ (క)

## —(*) కవితాప్రశంస. (*)—

నిగుడునవరసములును ద । ద్విగుణంబగు వర్ణనములు దీపింపఁగఁద।
ద్విగుణాలంకృతులును ద । ద్విగుణములగు నర్థభావవిధములు గలు
గన్॥ (క) తెనుఁగైన నేమి కవితా । జనితాలంకారచిత్రసంగతప
దవ । ర్ణనవచనరచనచతురత।వినయోగ్యంబైన కృతియు విందురు బుధమ
హాత్ముల్॥ (మ) దోషయుతంబు నెంతయును దొడ్డది యైనను నిందితం
బు ని । ర్దోషము కొంచెమైన జగదున్నతిఁ బొందుఁ గళంకహీనస।
ద్వేషశశాంకఖండమును విశ్వవిభుండు కిరీటకోటిపై । భూషణలీలఁ దా
ల్చి నలపూర్ణశశాంకు ధరింపఁ గోరునే॥ (క) భూషణలీలల దేశ
వి । భాషలు తత్తద్దేశభాషణము లగున్ । భూషించు వస్త్రము
ట్లసు । భాషితమై సంస్కృతంబు బహుదేశములన్॥ (చ) జనని స
మస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్ । ఘనలలితార్థ
గౌరవవికాసి తెనుంగది రమ్య మంతకున్ । గనుఁగొనఁ జాతబీజము
నకంటెను గోమలపత్రపుష్పశో । భనవపల్లవాభినవ బాలరసాల
ము సొంపు నింపదే॥ (ఉ) జల్లియు సక్రమంబున పశబ్దము వైరి
పదంబు జడ్డునున్ । బొల్లయు ద్రాబకంటకముఁ బూరకమున్ వి
రసంబు జోలిగా। నల్లిక లల్లు కబ్బములు నాదర చేయమి వాక్యచాతు
రీ। సల్లలితార్థసృష్టి గల సత్కృతి సేవ్యముఁ బొందు కైవడిన్॥(మ)
సరసాలంకరణోపమానకవితాసంధిక్రియాచాతురీ। భరితప్రౌఢి రచిం
చు సత్కవి జగత్ప్రఖ్యాతి వర్ణింపఁగా। గరిమం జేలుచు దుస్సహా

ననిపుణుల్ గర్వింతు రల్పజ్ఞులై । హరి యుండఁగ హరినామశ్లోకతతుల య్యర్థిం బ్రలాపింపవే॥ (ఉ) మేదురచాతురీమృదుల మిశ్రవిచిత్రకవిత్వ తత్త్వస । మ్మోదరసజ్ఞతానురతి మూర్ధముఁ జెలుంగునె ప్రాజ్ఞ శైవ డిక్ప్రమదటిద్యాకులు సైసఁగు మేష మెఱుంగునె యిందుఖండికా। స్వాదరసానుభావమును సారమదేభ మెఱుంగు సంగతిన్॥ (ఉ) వారిజగర్భుఁ బత్ని పదవారిజసన్మధుమాధురీధురీ। స్ఫారకవిత్వతత్త్వమును బ్రాజ్ఞుని జైవడిఁ గూళి మెచ్చునే। సారపయోధిరిత సరసత్వవికస్వరచంద్రచంద్రికా । పారమయూఖ రేఖలకుఁ జైకొని యుబ్బునె యుప్పుకూపముల్॥ (ఉ) దూషణ మేల చేయ నల ధూర్తుల నిష్ఠురకష్టదుర్వచో। దూషితసజ్జనుల్ వినుఁడు ధూర్తనికాయము మీకు నాత్మసంతోషయతోవిశేషజగదున్నతహేతువు గాదె ధాత్రిపై। నూసరదీర్ఘికల్ గలు

—(*) కృతిపతివర్ణనము. (*)—

గ నున్నతిఁ బొందవె చారుదీర్ఘికల్॥ (సీ) ఏదేవదేవుని యుచ్చలోవి హరించు వారిజాసనుఁ డశ్వవాహనుండు । వలగొని యేదేవు వస్త్రంబు భాండార మింటి కాపుండుదు రింద్రముఖ్యు। లేమహాదేవు మహాత్మ ధూపాళికిఁ బాతాళభువనంబు బహుళపేటి। భాసిల్లు నేదేవతాస్వార్థ భామిని కనిమదుగ్ధాంభోధి యస్త్రశాల । యట్టి దేవుని సర్వేశు నఘనివర్తి। లలితశుభమూర్తిఁ గరుణాకళాప్రపూర్తి । శశినులతకీర్తి శ్రీలింగచక్రవర్తిఁ । బర్వతాధీశు మత్కృతిప్రభు నుతింతు॥ (వ) అని ప్రబంధం బాంధ్రభాషానుబంధంబుగా నారొనర్పం బూనిన శ్రీపర్వతపురాణాధీశ్వరునభివర్ణించెద॥

## షష్ఠ్యంతములు.

శివునకుఁ బంకజగర్భా। ద్యవధీశున కఖిలదేవతావంద్యునకున్। భవునకు హిమగిరిపుత్రీ। ధవునకుఁ గైవల్యరాజ్యచింతామణికిన్॥

శంసితమునిహృదయసరో। హంసమునకు శివున కంధకాసురమదవి। ధ్వంసునకు శీతభానువతంసున కచలాధినాథతనయేశునకున్॥ ౫॥

ఆస్తాంగమితస్మరునకు। మస్తకమాణిక్యకిరణమాలామృతులకు। న్యస్తామరసింధుప్రునకు। ప్రస్తుతరణబంధునకును బహువేశునకున్॥ ౩॥

శ్రీనాగాలంకృతఫణికి సు। వర్ణాచలకార్ముకునకును వామాంగునకున్। స్వర్ణాగనిభాంగునకును। పన్నగాధీశునకు శైలపతిభవనునకున్॥ ౪॥

కంఠశర్వాణిమరుద్గణ। పంకేరుహాసంభవునకు బ్రఖ్యాతమహా। హుంకారాహితమద। పంకాపహపతికి శైలపతిభవనునకున్॥ ౫॥

గీర్వాణవినుతపదునకు। పర్వాచీనప్రభాయతాకారునకున్। ఖర్వేతరచామీకర। పర్వతనిలయునకు శైలపతిభవనునకున్॥ ౬॥

శీలాన్వితభక్తమనో। నాళీకాసనున కర్ధనారీశునకున్। లాలాసుర మదహరునకు। పాలితదివిజునకు శైలపతిభవనునకున్॥ ౭॥

కంఠీరవాఖ్యవిక్రమ। కుంఠనునకు కుంభిదైత్యకోపాటోపా। కంఠప్రతాపహరునకు। గంటాకాళునకు ప్రమథగణపాలునకున్॥ ౮॥

(*) కథాసంగ్రహము. (*)

(వచనము) అంకితంబుగా నాయొనర్పం బూనిన శ్రీశైలమాహాత్మ్యంబునకుం గథాక్రమం బెట్టిదనిన శిలాదుండను మునీంద్రుండు పుత్రార్థియై తపంబు సేయుటయును నమ్మునీంద్రుని తపంబునకు మెచ్చి శ్రీమహాదేవుండు నందీశ్వరుని శ్రీపర్వతునిం బుత్రులుగా ననుగ్రహించుటయు నందీశ్వరుండు తపంబు చేసి పరమేశ్వరుని మెప్పించి ప్రమథాధిపత్యంబును ఈశ్వరునకు నిజవాహనత్వంబునుం బడయుటయును పర్వతమునీంద్రుండు తపంబు సేసి పరమేశ్వరు మెప్పించి ముజ్జగంబులం గల పుణ్యతీర్థంబులు పుణ్యపర్వతంబులుం దన మీఁద మహాతిశయంబులై యుండను వరంబును సకలదేవతాసహితుండై పరమేశ్వరుండు పర్వతలింగనామంబునం దన శిరంబున సదాసన్నిహితుండై యుండ వరంబును వేఁడిన నమ్మహాదేవుండు ననుగ్రహించుటయును వసుమతి యను మునిపుత్రి యప్పర్వతంబునం దపంబు సేసి శ్రీనామంబు వడసి సీమాలంఘన త్రితంబున నందు మోక్షంబు వడయుటం జేసి శ్రీపర్వతంబను నామంబు

గలుగుటయును చంద్రగుప్తుం డను భూమీశ్వరుండు దనపుత్రిక యైన చం
ద్రవతిం జూచి మోహించిన నతని యంతరంగం బెఱింగి తొలంగి యా
చంద్రవతీకన్య సఖులుం దానును శ్రీపర్వతంబున కరిగి పర్వతలింగంబును
మల్లికాపుష్పంబులం బూజించి గానవిద్యావిలాసంబున హృదయంబుఁ
గరఁగింప మెచ్చి యమ్మహాదేవుండు వరంబు వేఁడుమనినఁ దాఁ బూజిం
చిన యర్జునవర్ణం బైన మల్లికాదామంబు పేర మల్లికార్జుననా
మం బవధరింపవలయు నని వరంబు వేడిన నమ్మహాదేవుండును మల్లి
కార్జునలింగనామం బవధరించుటయును శ్రీశైలంబునందుఁ గల గం
గాదితీర్థంబుల మాహాత్మ్యంబులును శక్తిశివలింగస్థానంబుల యందలి
శివలింగపూజాఫలదర్శనమాహాత్మ్యంబును అష్టశిఖరంబుల ప్రశంస
యు శ్రీశైలచతుర్ద్వారంబులం గల శక్తిశివలింగస్థానంబులును అం
దుల తీర్థవిశేషంబులును శ్రీశైలంబున కరుగు మాసఫలంబులును అం
దుల శివలింగతీర్థమహాత్మ్యంబులును తత్సాధకఫలవిశేషంబులుం జె
ప్పిన ముప్పది రెండు అధ్యాయంబు లందును పండ్రెండువేలున్నూఱు
గ్రంథంబును సనత్కుమారుండు వేదవ్యాసునకుం జెప్పిన శ్రీపర్వత
మాహాత్మ్యం బాంధ్రభాష నేనొనర్పం బూనిన కథావిధానం బెట్టిదనిన॥
(మ) పరమస్కాందపురాణసంహితలలోఁ బంచాదశాఖ్యానముల్। వ
రుసన్ జూచుచు నందు శ్రీగిరిమహాత్మ్యం బైహికాముష్మిక। స్ఫురణా
నందకరంబు భవ్య మనుచున్ బుణ్యప్రబంధంబు నే।విరచింతున్ బద
బంధబంధురకళావిభాషవాగ్వైఖరిన్॥ (శా) గంగాతీరపవిత్రసైకత
చమత్కారంబుగాఁ బ్రస్తుతిప్రాంగంబై వటబిల్వపిప్పలతరుచ్ఛాయా
రిశ్లాఘ్యమై। రంగత్స్రుక్స్రువ మంత్రపూతమగు భారద్వాజవాసీంద్రపా
త్సంగస్థానమునందు బ్రహ్మసుతుఁడు త్సాహంబు సంధిల్లఁగన్॥(సీ) త
రుణైన మాలూరతరువాటికాంతారసైకతవేదికాస్థలుల యందు। గం
గానదీతటైకకాంతభూములయందుఁ జిత్రసింహాసనాసీనుఁడగుచు। సభ
దిక్ప్రజ్ఞావిశాలబాహాపుణ్యగోష్ఠీవినోదంబు కొనలు సాగ। శివభక్తా

గాగమసింధువీచికలలో లాలితోత్సవలీల నోలలాడి। సకలమునివర శ్రే ణికాసహితుఁ డగుచు। మహిమ దీపింప వైధాత్ర మౌనివరుఁడు। మృదులభాషల సంలోకహృదయుఁ డగుచు। వివిధ వేదాంతసూత్రులు వి స్తరింప॥ (సీ) తైత్తిరీయణేయంబు మండూకశాక్లేయసామాయణేయా దిశాఖలందు। వాతాంతపేయంబు వైనేయశౌనకశ్యాపాయనీయాది శాఖలందు। గాపాలవారాహగర్గసురాణీయచరకకాత్యాయనశా ఖలందు। వైధేయముద్గలవారాసురాణావిశాలీయభాషల్లశాఖలం దుఁ। దచుపశాఖాదిసూక్తప్రధానపఠనఁ। బరఁగి వేదాంతసూక్త ముపన్యసింప। ఖండనాఖండనోద్దండగరిమమై అసి। వేదభాష్యంబుఁ జె ప్పుచు విధిమతుండు॥(వ) ఇట్లధివసించిన సనత్కుమారునాశ్రమంబున

—(*) సనత్కుమారునియొద్దకు వేదవ్యాసుండువచ్చుట. (*)—

కుం గృష్ణద్వైపాయనుండు శిష్యపరివృతుండై యేగుదెంచి॥(సీసము) పరిస్తుతాలంకారభసితత్రిపుండ్రముల్ ఫాలభాగంబులఁ బ్రజ్వరిల్ల। రుచిరమంత్రపోక్తరుద్రాక్షమాలికానివహంబు మేనుల నిండఁదాల్చి। భాస్వజ్జటాజూటపటలీభరంబు లయ్యేవటుస్థలంబుల నత్తమిల్లఁ। గటితటంబుల నీరుకావిదోవతు లూన్చి సజ్జలశివలింగసమితిఁ దాల్చి। ముద ముఁ దేజంబు మెఱయంగ మునిజనంబు। లుభయపార్శ్వంబులనువి శేషోక్తులందు। జీవపరమాత్మతత్త్వైకసిద్ధమైన। తత్త్వమస్యాదిసూక్తు లందఱు పఠించి॥(ఉ) కిన్నరకామినీసురతఖేలపరిశ్రమవారిఁ దోగి యు। త్పన్నతమల్లికావకుళయూధవధూజనమంజరీవ్రజా। భిన్నకుచంబు లంటి మునిబృందము మీఁద సుమాళి మొప్పఁగాఁ। గొన్ననవిల్తు సేనకె లంగోలుగ నేగె సమీర మింపుగన్॥(వ) అంతటఁ గిటికిరటిఘటాకఠోర ఘీంకారనాదంబులును వాతప్రమీదాత్యూహనిష్ఠురపటిష్ఠధ్వానకోలా హలంబులును చూర్ధ్వాఘూటనిరోఘూటకహాకహారావకలకలంబులును భల్లూకనివహాఘోరఘోషపటుమధుమధ్వానంబులును బుంస్కోకిలమృదుల కంఠకాకుహారవహుంకారంబులును ఘూర్ణిల్లుచు దిక్కుటుంగంబు

లఁ బ్రతిధ్వానంబులీన నానాద్రుమలతా కీర్ణంబులైన దివ్యాటవి నేతెంచె నంత॥ (శా) శాకోటార్జునమాతులుంగఫలినీజంబీరజంబూవనీ। మాకందారగ్వధకదంబనింబకదళీ మల్లీమతల్లీలతా । నేకానోకహపల్లవాంకురతలోన్మీలత్ప్రసూనోద్గమా। నీకక్రేంకశిలాటుకోత్కరఫలోన్నిద్రాటవిఁ జూచుచుఁ॥ (క) కలకంఠకంఠకందళ। కలహంసకకలభఖడ్గకారండమహా। కలవింకకంకకాసర। కలరవములకలకలంబుగలకాననముఁ॥ (క) మల్లి మతల్లీ సుమనో। వల్లీ వేల్లితకుడుంగవగోచరగభ్య। ద్ఝిల్లీరవయుతపక్షిణ। పల్లీవాచంయమేంద్ర భవ్యస్థలులఁ॥ (వ) కనుంగొనుచు నేతేరముందట॥ (మ) కనియెఁ వ్యాసుఁడు వాగ్విలాసుఁడు సమగ్రప్రీతి మందాకినిఁ। ఘనపాఠీనఝులీకుళీరకమఠనక్రాళినిఁ నిత్యఖే। లనదేవేంద్రపురాంగనాకుచతటాలంకారకర్పూరచం। దనలుంటాకినిఁ జక్రవాకిని విశుద్ధవ్యాయశ్లోకినిఁ॥ (క) మందాకినీతటిన్యర। విందవికాసప్రసూనవిహరణమరుదానందరసకందళితక। మఱందిప్రభురాజు సౌఖ్యమతినే తెంచెఁ॥ (వ) అట్లేగుదెంచి యమ్మందాకినీ జలంబులఁ గృతస్నానుండై కృష్ణద్వైపాయనుండు నిజశిష్యపరివృతుండై యేగుదెంచిన సనత్కుమారుండును బ్రత్యుత్థానంబుఁ జేసి యుచితాసనంబున నాసీనుం గావించి యర్ఘ్యపాద్యాదివిధులొనరించి యతిథిసత్కారంబులఁ బరితృప్తుం జేసి కొంతప్రొద్దు సముచితాలాపసుఖాంభోధి వీచీ నిమగ్నసంతోషాయత్త చిత్తులై యుండ నాగమనప్రయోజనం బ

—(*) వ్యాసుండు సనత్కుమారునిఁ బుణ్య క్షేత్రంబులఁ జెప్పుమని యడుగుట (*)—

డిగిన బ్రహ్మపుత్రునకుఁ బరాశతనూభవుండిట్లనియె॥ (సీ) ప్రవహించె నెచ్చోట బాలనవేంద్రేశ శేఖరుండమరేంద్ర సేవితుండు। సంధిల్లు నెచ్చోట సార్వకాలంబును భూలోకమునఁ గల్గు పుణ్యనదులు। దానతపఃకర్మధర్మంబు లెచ్చోట విపులపుణ్యంబులావిర్భవించుఁ। జరియింతు రెచ్చోట సాన్నిధ్యులై హరి బ్రహ్మాది దేవతాప్రముఖులెల్ల। ననఘమల్లోకముల కె

కుతుకమైనపుణ్య వసుధ యెయ్యది తెలియంగ వలయునాకుఁ। బుణ్యకథలె
ల్లి నెఱిఁగిన ప్రౌఢవీవు। అనఁతీవలె నాకుసంశయము వరేణ్యా॥ అనవుడు॥ (క)
నీవడిగినయీయర్థము। శైవాగమ వేదశాస్త్రసమ్మతము జగ। త్పావన
కరమగుశుభమును। గావించునుభోగమోక్షకారణ మనఘా॥ (క) ఒ
కతఁడినెవ్వఁడు జిహ్వను। బ్రకటించును శివునినుతులు పరమేశకథా। విక
సితమనోంబుజాతుఁడు। సకలగుణాఢ్యుండు దేవసముఁడు మహాత్మా॥
(సీ) ఈపురాణశ్రోతహృదయంబు సదయంబు పంచాక్షరీరసబ్రహ్మ జి
హ్వ। కాయంబు పుణ్యైకకాయంబు నాతని వదనంబుసదనంబు వరదున
కును। గుణంబు లీశ్వరాకీర్ణంబు లతులితభక్తి తాత్పర్యసపర్యచర్య। చ
రణంబు లతిశుభాచరణంబులై యొప్పుఁ గరములు శోభనాకరములగును।
నరుఁడుప్రియభక్తి నీపురాణంబు వినిన। నెసఁగు భోగంబు మోక్షంబుఁ జెం
దునందు। నని మహాదేవుఁ డంబిక కానతిచ్చె। నరణిఁ జెప్పెను నాకు సజ్జల

—(*)శ్రీపర్వతక్షేత్రంబుత్పన్నమనిసనత్కుమారుండు చెప్పుట.(*)—

జభవుఁడు॥ అది యెట్టిదనిన॥ (సీ) పాతాళగంగాకబంధవీచిచ్ఛటా
ఘూర్ణితబ్రహ్మాండగోలకంబు। విశ్వవిశ్వంభరా విర్భావనిర్భారమండన
శ్రీకర్ణకుండలంబు। భాస్వత్తృణేంధన పాషాణవాలుకాజ్యోతిస్తటీత్వి
ట్శోభితంబు। దీపితత్రిభువనతీర్థముక్తాఫల ప్రోద్భూతకారణ భువన
రాశి। పారదామృతకుండికాస్పర్శవేది। సర్వసంజీవనీమహౌషధవితా
న। పుణ్యపావనకాననాద్భుతమహత్త్వ। ఫలదమహిమోన్నతంబు శ్రీ
పర్వతంబు॥ (సీ) శిఖరంబుఁజూచినఁ జేరుఁగైవల్యంబు పురమహత్త్వం
బును బొగడవశమె। గిరిశిరోభాగంబు గిరిజేశ్వరుని మూర్తి పురిలింగ
మహిమలు పొగడవశమె। గిరిలుబ్ధకులు ముక్తిపురవరాధీశులు పురి
వీరభక్తులఁబొగడవశమె। గిరిజీవకోటులుగీర్వాణనివహంబు పురిజీవకో
టులఁ బొగడ వశమె। ప్రథితపృథుపాపసంహారప్రభంకపాగ్ర। గండ
పాషాణవాలుకాఖండవహ్ని। సలిలపవమాన మృగపవిస్తంభనాది।
ఫలదమహిమోన్నతంబు శ్రీపర్వతంబు॥ (వ) కుంభసంభవునిచేతఁ జర్చిం

పంబఱిన వింధ్యాద్రిదర్పం బెంత గోవిందునిచేత నెత్తంబడిన మందరం బు సుందరం బెంత రావణాసురోత్పాటితంబైన కైలాసంబు విలాసం బెంత భూధరధారేయుతమాని కార్ముకంబైన మేరువు బరు వెంత జలజాప్తమరీచికలకుం గాక యనలు హసించు హిమవత్పర్వతంబు గర్వంబెంత నిర్భరంబైన గర్భంబున నావిర్భవించిన మిత్రతేజం బణంగించు నస్తాచలంబు శస్తం బెంత చందనసందోహంబుఁ దఱుఁ దఱిన వృక్షంబుల నొల్లని మలయభూధరంబు మహత్త్వం బెంత రాఘవచాపంబునం బాసిన గంధమాదనంబు సాధనం బెంత సంతతభూభువనపావనత నున్న గోత్రంబుల చరిత్రం బెంత యొక్కొక్క శైలంబున కొక్కొక్క మహత్త్వంబు నెక్కొనుం గాక పెక్కులన్నవేక్షం బు కామ్యార్థభోగమోక్షసుఖాభివృద్ధులు సిద్ధించు భుక్తిముక్తులతోఁ వ మోక్షంబులు చేవ తపసుల యెల్లి తీర్థంబుల వెల్లి యెల్లలకెల్లనైన యెల్లకార్యంబు లుల్లసిల్లు శ్రీనగేంద్రంబునకు సదృశంబు లగు నగంబులు గలవె॥ (ఉ) గాయకభూరుహవ్రజమృగప్రకరోరగపక్షియూథముల్। గాయకభూధరంబులును గాయకగుల్మలతావితానముల్। గాయకఖడ్గకుంజరనికాయములుం విలసిల్లు నిత్యము। న్నాయక శ్రీనగంబు పయఃప్రస్ఫురణోద్ధతగంజనంబునన్॥ (ఉ) ఖేచరభూమిభృత్ప్రచయకీరమృగోరగగుల్మసంఘముల్। ఖేచరజంబుకాదులుమృగీహరిగండకజంతుయూథముల్। ఖేచరధారుణీజములు ఖేచరపుణ్యమృగవ్రజంబులున్। ఖేచరరీతి నెప్పుడును గ్రీడవహించును శ్రీనగంబునన్॥ (గీ) రూఢి యొప్పార నెక్కు యేరూపమైన। దలఁపఁ దమ్రూపముగఁ జేయుఁ దరుచయంబు। స్థిరముగాఁగోరిక సిద్ధింపఁజేయునట్టి। సిద్ధకళలును వర్ధిల్లుశ్రీనగంబు॥ (సీ) ఎన్ని కల్పాదుల నెందఱు పేంద్రులు నెన్ని కల్పాదుల నెంద ఱజులు। ఎన్నికల్పాదుల నెందఱు దేవేంద్రు లెన్నికల్పాదుల నెంద ఱమరు। లెన్నికల్పాదుల నెందఱు దైత్యేశు లెన్నికల్పాదుల నెంద ఱనఘు। లెన్నికల్పాదుల నెందఱు మునినాథు

లెన్నికల్పాదుల నెంద ఆర్యా । లన్ని యుగములయందును హ
రుఁ డదియ । నామములయందుఁ బార్వతీనాథు నిలిపి । ప్రథిత
కామ్యార్థసిద్ధులు వడయు కతనఁ । బరమపావనంగలింగ శ్రీపర్వ
తుండు॥ (సీ) పాతాళగంగాప్రపాతపాతోత్తుంగకల్లోలఘుమఘుమా
ఖర్వారవము । ముక్తితాటంకిణీముఖదర్పణోద్భాసి శిఖరాగ్రచకచక
శ్రీధరంబు । గదలిరసాతలగహ్వరాభ్రంకషస్థాలీశిలాధగద్ధగితకాంతి।
శాతకుంభాగారచంచన్మణిచ్ఛటాస్థగితనూతనధాళధళ్యరుచులుఁ । గలి
గి కమలాప్తచంద్రనక్షత్రతాళ । రసరసాయనబహుసుధారసనిపా
న । దివ్యసంజీవనీకళాదీప్యమాన । బహుళపుణ్యోన్నతంబు శ్రీప
ర్వతంబు॥ (క) తారాదులు బెరయఁదదా । కారంబులు పరుసవే
ది కనకముఁ జేయుఁ । దారాధిపాంకు శ్రీగిరిఁ । జేరిన జీవులను బు
ణ్యాజీవులఁ జేయుఁ॥ (సీ) సంతతఫలితవృక్షశ్రేణి కాదత్తభిక్షాశనవ్ర
తబృందములును । ఛిన్నమాళిలతాశిఖరాగ్రనవశివోద్ధతపునస్సంధా
నతరువనంబుఁ । బాషాణగుహలునభ్రంకషగ్రావముల్ క్షణమాత్రఫ
లనమచ్చారుతరులు । దీపితస్పర్శవేదీశల్యకరణులు శ్లేషసంధానసంజీ
వకళులు । లింగవాహిని నివహంబు లింగగిరులు । భూతికుండవ్రజం
బు విభూతినదము । నద్భుతోపేతబహుపావనాశ్రమములుఁ । గలి
గి విలసిల్లు శ్రీగిరికంధరమున ॥ (ఉ) భానుఁడు పుట్టఁ బుట్టుచును భా
నునితోడను గూడి వీడుచుఁ । భానుఁడు గ్రుంకఁ గ్రుంకుచును భాను
నితోడను గూడి నిత్యముఁ । బూనెడు భానుతాళవనభూరుహముల్
రవణిల్లునెంతయుఁ । శ్రీనగభూమినూతనవిశేషముల న్గడు నద్భుతం
బులై ॥ (వ) ఇవ్విధంబునఁ జంద్రతాళంబులును రసరసాయనసిద్ధకళ
లును మృగదైత్యమృత్యువిషోరగమహాబాలారిశనిసేనాగ్ని ఖడ్గపరనోద
కరోగప్రత్యర్థిపవిస్తంభకళలును బరకాయప్రవేశదివ్యౌషధంబులును
మొదలైనదృష్టసిద్ధవాంఛాపరులకు దృష్టసిద్ధులు సిద్ధించు వెండియు నప్ప
ర్వతేంద్రంబున మహాద్భుతపుణ్యవిశేషంబు లనంతంబులుం గలవనినవిని

వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టిదని యడిగిన నమ్మునీం ద్రునకు సనత్కుమారుం డిట్లనియె॥

—(*) ఆశ్వాసాంతము. (*)—

(క) తావకసేవకభిల్లక। దావికదళవరదభక్తతత్పరపరిష। ద్భావుకహిమకరవిచికిల। పావనజూటీకుటుంగపర్వతలింగా॥ (శా) సాయంకాలనటత్తటిత్ప్రతినిధిచ్ఛాయాజటాస్వర్ధునీ। తోయాస్ఫాలనవిస్ఫురల్లహరికాతుంతుప్పసంఘర్షణా। స్ఫాయచ్చంద్రసుధోపజీవితపరింటశ్రీకరోటీముఖామ్నాయస్తోత్రకథాఘటీభ్రమణసవ్యక్తాండవాడంబరా॥ (మాలిని) తరళమదనరూపాధఃకృతోద్యత్ప్రతాపా। సరసదివిజవర్గాస్థాపనాచార్యశౌర్యా। విరసదనుజనాశా విశ్వబృందారకేశా। సినతధనదమిత్రా నిత్యకళ్యాణగాత్రా॥

గద్య॥ ఇదిశ్రీమల్లికార్జునకృపాలబ్ధ మేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగగుణవర్య శేషనాథార్యప్రణీతంబైన
పర్వతపురాణంబునందుఁ బ్రథమాశ్వాసము.
శ్రీమద్భ్రమరాంబాసహిత మల్లికార్జు
నార్పణమస్తు.





శ్రీ ర స్తు.

శ్రీశైలమల్లికార్జునస్వామినేనమః.

శ్రీపర్వతపురాణము - ద్వితీయాశ్వాసము.

(క) శ్రీశైలపుణ్యమహిమము। లాశైలతనూజవినుచు నానంద సుధా। రాశిరసకేళిఁదేలుచు। నీశానునిఁజూచిత్రిభువనేశ్వరిపలికెన్॥ వచనము॥ దేవా తరువాతికథావిధానంబెట్టిదనిన నమ్మహాదేవుండంబికాదేవి కానతిచ్చినతెఱంగువినుమని సాత్యవతేయునకు సనత్కుమారుం డిట్లనియె॥ ... ... ... ❋

శ్రీశైలంబునంగల మాహాత్మ్యంబులఁ దెల్పుట.

(మ) సరిమేశ్రీగిరికేగిరుల్ సుఖకరస్వశ్రీకరాంభోరుహా।స్ఫురదాలంకృతచామరానిలమిళత్పుణ్యాప్స భోగక్రియా। పరిహాసీకృతశక్తిము క్తివనితాభాస్వన్మణిశ్రేణులన్। గరుణన్నిచ్చలు నిచ్చుదానమహిమల్ శైవల్యసత్రంబునన్॥ (ఉ) మాలితమానిపుష్పక సమాజవహిత్రపరంపరల్శుభా। స్థానికభక్తరత్నముల సంగతశృంగతరంగరాజిత్రా। చీన విశాలఫేనముల శ్రీకుధరేతరసీమవేలలన్। శ్రీనగరాజమూర్తిఁ విలసిల్లినుదుగ్ధపయోధికైవడిన్॥ (మ) పురుషార్థకాంబులు పాదముల్శుభము తత్పుచ్ఛంబుతచ్ఛృంగముల్ । గిరిశృంగంబులు రోమరాజితరువుల్ గ్రీవుల్దివృత్తాషరుల్। వరపుణ్యంబులు దుగ్ధధారలుచతుర్ద్వారస్థలింగంబులు। ధ్వరవక్షోజములీనగంబు నుతులొందున్ గామధేనుక్రియన్॥(మ) పరితఃక్ష్మాధరసంఘముల్విటపముల్ పాతాళగంగాదిసుందరతీర్థావళిగుచ్ఛరాజిశివశక్త్యాదుల్ ఫలస్తోమముల్।పరిషత్పంచజనుల్ తదుత్తమ ఫలప్రత్యగ్రకీరౌఘముల్। సరిమే శ్రీనగకల్పవృక్షమునకున్ సర్వంసహాశైలముల్॥(శా)కుంభత్క్ష్మాధరగహ్వరప్రతిరవాత్యుద్రాభ్రనిర్ఘోషముల్।

సంఘావాది దివాపసర్గఫలవిస్తారాంబువర్షంబులున్। శుంభత్తాపమహీ
రుహస్థిరస్ఫుణజ్యోతి స్తటిద్వల్లికా। రంభంబుల్ విలసిల్లు పర్వతమహా
భ్రిం బొప్పు విభ్రాజినై॥ (క) ఎక్కడఁ జూచిన సురనదు। లెక్క
డఁ జూచినను శంభుహేమగృహంబుల్। ఎక్కడఁ జూచినఁ దీర్థము।
లెక్కడ శ్రీనగము సాటియే వేఱగముల్॥ (వ) అట్టి పర్వతంబున॥
(సీ) భసితంబు భూమిభృత్ప్రాంతదేశంబునఁ దరుచైన రుద్రాక్షత
తులు గడచి। ధవళితస్ఫటికాద్రితరువనస్థాయులై సల్లాపశైలముల్
సంతరించి। సల్లాపభూరుహచ్ఛాయ లుల్లంఘించి గాయకపర్వతో
త్కరము దాఁటి। గాయకవృక్షోపకంఠభూముల నిల్చి నాట్యాచలం
బుల నటన సలిపి। నాట్యభూరుహగుల్మవానరఫణీంద్ర। బహులతా
నేకమృగసింహపక్షిసమితిఁ। జూచి క్రీడింపుచుందురు సుఖము లొం
ది। సాధకోత్తము లెపుడు శ్రీశైలమునను॥ (వ) అనిన విని సాత్య
వతేయుం డిట్టి మహత్త్వంబు పర్వతునకుఁ గలుగు టెట్లనిన మహాదే
వుండు పార్వతీదేవి కానతిచ్చిన విధంబుఁ జెప్పెద నాకర్ణింపు మని
సనత్కుమారుం డిట్లనియె॥ (సీ) సురధేనుగోష్ఠసంశుద్ధరోమాంధపరి
సిద్ధపావనకనచ్ఛ్రేణికలను। తత్త్వప్రదేశవిస్తరసుధాదీర్ఘికాశోభా

—(*) కైలాసంబున నీశ్వరుండు కొలువుదీరియుండుట. (*)—

తమాణిక్యసోపానములను। స్వర్ణవేదిగ్రావబంధబంధురహర్మ్యాభవ
నశోభితసాలభంజికలను। చారుచామీకరస్థాపిత నవరత్నకుట్టిమప్రా
కారగోపురముల। నమరువిద్రుమభద్రరుద్రాక్షవృక్ష। పరిచితోన్న
ద్రికల్పద్రుభవనమధ్య। కిన్నరావరయువతిజేగీయమాన। లలితమ
హిమోన్నతంబు కైలాసనగము॥ (మ) అమరేంద్రాదివిశాలవైభవ
పరీహాసంబు సంజీవనీ। ద్రుమలీలావనకేకివాసము సురస్త్రీమాప్సరః
కిన్నరీ। ప్రమదాధ్యాసముఁ దత్సు[illegible]వాసము।
స్ఫురిమదోల్లాసముఁ గల్పభూరుహమనోద్భాసంబుఁ గైలాసముల్॥ (వ)
నిజవాసంబుగ నున్న విశ్వవిభుఁ డానిశ్వాసితామ్నాయుఁడ। గ్గజరా

ట్చర్మజపటీకటీరుఁ డసదృక్షైరవ్యలక్ష్మీసమేదుం । డజవైకుంఠసురేం ద్రముఖ్యాదనుపుత్రాధీశసంసేవ్యుఁడై । త్రిజగద్వంద్యుఁడు పెద్దకొల్వు న మహాతేజంబుతో నున్నెడన్॥ (క) చండీశ్వరుఁడు నుతింపఁ బ్ర । చండుఁడు భృంగియును హాస్యచతురతఁ జూపన్ । మెండుగ నచ్చరలేమలు । నిండు రసస్థితులతోడ నృత్యము సేయన్॥ (క) పటుగతులఁబలుకు బాబాపుటములఁ బాడుచును హరిణపుటములు దాటన్।జటులగతిఁ గ్రీడసలుపుచు । నిటలాక్షునిఁ గొలుచుగుహుఁడు నికటమునందున్॥ (ఉ) నిండిన కుంజబాజ్జకళ సిగ్గులు దేరఁ గుఠారధారయున్ । దుండము నుందటన్ మెఱుపు నూలొరన నేనుఁగు మోముదమ్మితో।మెండుగ నెలరవారువము మీఁదను రౌతుదనంబుఁ జూపుచున్। గొండయనుంగు టల్లునికిఁ గుంజరవక్త్రుఁడు ముద్దు సల్పగన్॥ (క) భద్రాత్మభద్రవీరక। భద్రమహాకాళవీరభద్రాధీశుల్। భద్రాసనంబు డగ్గరి।భద్రాధరుఁ గొల్తు రుభయపార్శ్వములందున్॥ (సీ) ఒకవంకఁ గింకరు లుద్దండవేదండదైత్యజయాదిగీతములు వాడ।నొకచోటఁ గుంభకుంభోదరకుంభజశ్రీనికుంభాదులు చేరిపొగడ। నొకవంక హరిపంకజోద్భవపాత్రీవబహిర్ముఖాదులు బలిసికొల్వ । నొకవంకనిశ్శంక యుక్తనిరాతంక నిమరశంకాదులు నిండియుండ । నగ్రిభాగంబునను వేత్రహస్తుఁ డగుచు। బలిసి నందీశ్వరుఁడు సురాభటులు మాన్పఁ।బ్రమథు లిరువంకలను బరాబరులు సేయ।హరుఁడు పేరోలగంబున్న యవసరమున॥ (గీ) గిరిశునకు మ్రొక్కి యెదురఁ గేంగేలు మొగిచి।విశ్వనాథునకిట్లని విన్నవించె। నరుణపల్లవపాణి నీలాళివేణి। సకలకల్యాణి శుకవా

—✽ శ్రీనగంబునశివుండునిల్చుకారణమును పార్వతియడుగుట. ✽—

ణి శంభు రాణి॥ (వ) దేవా యీనువనంబునందు శైలోత్తమశ్రేణులు హిమవత్పర్వతంబును హేమకూటంబును నీలమేఘనిభంబైన నీలపర్వతంబును రజతప్రభా భాసితంబైన శ్వేతశైలంబును శృంగత్రయంబునుం గలిగి సకలదేవభవనంబైన శృంగనగంబును జ్వలనప్రభంగల

కుంజరగిరియును బాలసూర్యప్రభంగల హేమాచలంబును భిన్నాంజనప్రభం గల గంధమాదనంబును మరకతప్రభాభాసురంబైన మాల్యవంతంబును సర్వరత్నమయంబై పద్మరాగనిభంబైన యుదయమహీధరంబును మలయభూధరంబును జంబూనదనిభంబైన తుషారధరంబును శంఖకుందేందునిభంబైన కైలాసశిఖరియును వర్ధమానగోత్రంబును రౌప్యధాతుయుక్తంబైన రౌప్యవంతంబును హరిచందనవర్ణంబైన హరినీలశిలోచ్చయంబును మృణాళసన్నిభంబైన వైరోచనాద్రియు రత్నప్రవాళభాసురంబైన శతపర్వతంబును కుంకుమవర్ణంబైన కింశుకధరిత్రీధరంబును స్ఫటికనిభంబైన విద్యుత్పర్వతంబును నీలోత్పలశ్యామంబైన పుష్పగిరియును మొదలైన సర్వసువర్ణసహాసంరంభణ నానాద్భుతంబులం గల కుంభినీధరంబుల నెల్ల నతిక్రమించి శ్రీశైలం బశాంతక్రీడావినోదస్థానంబుగా నావించుకొని యున్నవాఁడ వెందుల మాహాత్మ్యం బెట్టిది యానతీయవలయు ననిన నమ్మహాదేవుం డమ్మహాదేవి కిట్లనియె॥

## —(*) శిలాదమౌని తపంబు చేయుట. (*)—

(క) ఆదియుగాదుల కట మున్నాదిమతాపసవరేణ్యుఁడైన శిలాదుం।డాదియుఁ దుదియును సరిగా। మోదంబునఁ దపము సలిపె మునులునుతింపన్॥(క)బృందారకు లరుదందఁగ। నిందుకిరణములను వాసరేంద్రప్రభలన్। డెందమునఁ గ్రోలి తాలిమి।గుందక వర్షములు మూఁడుకోట్లు సలిపెన్॥(వ)మఱియును॥(క)శతకోటివత్సరంబులు। ప్రతిదినము కించిత్ శిలయె భక్షించి సదా।గతి తత్త్వయోగవశమున।జతురుండై నిలిచె మౌని సంఘము వొగడన్॥(చ)పనులను నార్వురం గుదియఁబట్టి జయించి పదద్వయంబునన్।మరిగిచరించునట్టి పవమానము జోఁకకుఁ దెచ్చి వానిచే।దిరముగఁ బాపముంతిని విధేయవశంబున శీలుండొప్పియా।వరుసన వచ్చి వెన్నడిమి వాఁకిలిఁ గాంచియు నందు జొచ్చటన్॥

(గీ)పవనుఁ గుంభించి మఱియు నప్పవనగమన। మహిమవశమున యోగాగ్ని మండఁజేసి।దివిజు ముట్టింప వారని దీపమైనఁ।గరము మోవఁగ లోని చీఁకటియు మ్రాన్చె॥(చ)ఒడికముగాఁగ నెన్నఁడిమి యగ్గులు మానిపి శంభు మూర్తికిన్।విడిదళకై దళద్వయయనవీనపయోజము నిల్పి యుండుపై।హృదుఁ గని సౌఖ్యమంది మది మించిన పశ్చిమనాడిచేత మై వడిఁ గరగించెఁ జిద్గగనవాటికయందుఁ బ్రమోదచంద్రునిన్॥(క) కరఁగించె నమృతధారలు।తొరగించె సుధానుభావతృప్తి దొలఁపన్। బెరిగించెను సంతోషము।మరగించెను శంభుఁ దనదు మానసవీథిన్॥(వ)మఱియు బ్రహ్మాండంబులం గల చిహ్నంబు లన్నియుం దన పిండంబునం గనుంగొనుచు భూజలాగ్నివాయువ్యోమభూతంబులను బర్వతసాగరద్వీపనదీయుతభువనగ్రహనివహంబులును నాత్మభవనంబునందుఁ గానంబడ సవ్యభాగంబున నిడానాడి చంద్రుండు షోడశకళాసహితుండై యుండు దక్షిణభాగంబునఁ బింగళనాడి సూర్యుండు ద్వాదశకళాసహితుండై యుండు సూర్యేందువర్తనంబులం గాలంబు వర్తించు నందు పరి. భాగంబున ననలతత్వంబును నధోభాగంబున జలతత్వంబును మఱియు నరువది నిశ్వాసంబు లొకటి గడియయందునొకొక్క వేళ సూర్యుండును జంద్రుండును వర్తించు నైదు గడియలు గూడ లగ్నం బవి పండ్రెండు నొకటి దివసం బందులకు నిరువదియొకటి వేయిన్నార్నూఱు స్వరంబు అంటె దినపక్షమాసర్తువులు నడచు దినవారనక్షత్రయోగకరణగ్రహణపురోగమకాలచక్రస్వరచక్రంబు లనేకప్రకారంబులఁ జంద్రసూర్యపక్షంబులు చంద్రసూర్యనిధులును జంద్రసూర్యయామంబులు చంద్రసూర్యఘటికలు చంద్రసూర్యగ్రహంబులై నాడికామార్గంబులు వర్తిల్లు నందు విషామృతస్వరఫలంబులవలన హానివృద్ధులు లాభాలాభంబులు మానావమానంబులు హృదయపద్మోపకంఠదీప్తాబ్దదళజీవహంససంధానఫలంబులు నాత్మోదయం బందఁ గాంచుచుండు॥(ఉ)ఆచపలేతరాత్ముఁ డమృతానుభవంబునఁ దృప్తిఁ బొంది దిశా।లోచనిలోని చూ

వులును లోని విరక్తియు లోని చింతయుఁ। లోచవి తత్త్వసౌఖ్యనిధిలో
నఁ జరింపుచు బాహ్యచేష్టలఁ। జూచి పరిత్యజించును ద్రిశూలిఁ దలంచి
తపంబు సేయుచుఁ॥ (క) పంచాక్షరిజపియింప సమంచితపరవశత న
క్షమాలిక చేనా। కించుక యంతరపడనిశ్చంచలుఁడై కన్ను మోడ్చి
సంయమి యున్నఁ॥ (సీ) అందంద నిద్రించు నద్రి చందంబున వక్ష్న
పానాదులు నప్పరమున। నిండార వతిఁపంప వెన్నదు శ్రోవయందుఖ
డి చిణీశబ్ద ముద్భవించి। చిణిచిణి యని ప్రమోయుఁ జెలఁగి శంఖాంభో
ధి తంత్రికానాదమదఁల నినాద। భేరినిస్స్వానసంభృత వేణుతాళాది
ఘంటానినాదమేఘస్వనములు। మెలసి దశవిధముల ప్రమోయంగ నా
క్రిందఁ। దొమ్మిదింట మాని లోరమైన। నాద ముల్లసిల్ల నాదప్రియుం
డగు। నాగధరున కర్పణంబు చేసి॥ (క) ఈవిధమునఁ జరియింపఁగ।
నావిభునకు మనసు లీన మయ్యెను నయినఁ। దేవయ్యెను కమణాము
లటు। గావున సంకల్పమును వికల్పమునుడిగెఁ॥ (వ) ఇట్లు మహాదే
వునిం గూర్చి భక్తి నిస్తారిస్తుండై తపంబు సేయు చున్నంత॥

—(*) శిలాదునకు నీశ్వరుండు ప్రత్యక్షంబగుట. (*)—

(సీ) మొలకచుకలరాజు మొల్లపువ్వును బోలె మించిన మౌళిఁ గీలిం
చినాఁడు। పొడలకెంజాయలఁ బులిరకరాసునితోలుఁ గటిపొదదిండుగాఁ
గట్టినాఁడు। విశదరత్నప్రభల్ వెదచల్లుశేషాహి గొడుగుపావాలుగాఁ
దొడిగినాఁడు। వడఁకుగుబ్బలిరాచవారికన్నెను మేన నచ్చినగతినుండ ని
చ్చినాఁడు। కలికిచూపులఁ బచ్చవిలారినిఁజూచి। భూతినెరపూఁతగా
మేనఁబూసినాఁడు। అట్టిదేవుండు సకలకళ్యాణమూర్తి। యాశిలాదు
నిమొదురఁబ్రత్యక్షమయ్యె॥ వచనము॥ ఇట్లు జగదారాధ్యుండైన యీ
శ్వరుండు ప్రత్యక్షుంబైన నమ్మునీశ్వరుండు సాష్టాంగదండప్రణామంబు
చేసి పులకచయకంచుకితశరీరుండును నానందకందళిత హృదయాంగవిం
దుండును ముకుళితకరకమలుండును నగుచు నిట్లనిస్తుతియించె॥ దండక

మ॥ శ్రీ కైరుద్రైలాససింహాసనాధీశ నాకేశముఖ్యామరస్తోమమస్తస్థలీ
హేమకోటీరవిస్ఫార మాణిక్యరింఛోళిపాళీ మయూఖాగ్ర కింజల్కిత
శ్రీపదాంభోజ సత్కీర్తికర్పూర సంవాసితాంభోజ గర్భాండభాండా
మహోద్దండశుండాలదైతేయ ఖేలాతమః ఖండమార్తాండ దోర్దండ
హేమాద్రికోదండ చండేశ్వరస్తుత్య నిత్యానిరాతంకనిశ్శంక నిర్ద్వంద్వ
నిస్సంగనిర్లేప నిర్మాయికా నిష్కళంకాసిరీహాసిరాకారసాకార పా
దాంబుజాలంకృతాశీవృషాధీశ రాజత్తులాకోటి రత్నావళీ క్షుద్రఘం
టార్వనిధ్వానితత్సాస్వర శ్రేణికాకందరా సుందరావాస లావణ్యరేఖా
కళాదభ్రిరుగ్రాంగనాబాహువల్లీమతల్లీ పరిష్కార జేదీప్యమానేంద్ర
రత్నావళీధాళ ధ్వన్యక్వణచ్చామరోద్ధూత వాతప్రచారాలకా శోభ
నాకారకంజాత సంజాతకోటీకరోటీ సదాకల్పజూటాటవి చంద్రచం
ద్రాంతపాస్ఫార నానందఖేలాదిరాజచ్చకోరా మహోదారదంష్ట్రేతర
జ్ఞానశుంభస్సమాధాన విశ్వంభరాంభోజ సంభూతజంభాసురారాతి
కుంభీనసాధీశ కుంభోధరాగస్త్యకుంభీంద్రవక్త్రాది విస్రంభభక్తక్రియా
రంభసంసేవ్య హాలాహలాభీలకీలాపరీహాసలాలా సురాటోప ఖేలావిశా
లస్ఫూర్తిమాలాయుధజ్వాలజాలామహాకాళపశ్యల్లలాటా వియత్సింధుజూ
టాంకశ్శాజూటపాటీర కల్పద్రుమపాణిగ్రహశ్రీకవాటీ ధరిత్రీసమాటీకన
స్పృశ్యధూటీమహాకల్పఘాటీ కరాంభోజ విన్యాసవృత్తానునాదాసదా
మోదఅభ్రాపగాహీర శుభ్రాంబుజక్షీర భిభ్రీతతుళాశారదభ్రాభ్రి
మూరకాషదభోగీరగాదీశ విభ్రాజమానేందుమందారబృందారకాధార
నీహారకాసారకీర్తికృపామూర్తి భిల్లాంగనాబిల్వవల్లీ దళప్రేమభిల్లాసు
రస్వాంతపల్లాసురేంద్రాది వల్లీజయోల్లాసమల్లీ ప్రసూనాంగవల్లీ స
దారాధ్యసల్లీలభక్తాత్మ హల్లీసకాయోగిహృల్లీ నసంబంధ దంతావళీ
త్వక్పటచ్ఛత్రాకుబేరాప్తమిత్రా సమాఖ్యాచరిత్రాలలటాగ్నినేత్రా మ
హాగ్న్యాకళత్రా పవిత్రాంగదేవాగణవ్రాతగీర్వాణభూజా నుతశ్రీవిరా
జాజగద్గీతతేజా జితశ్రీతనూజా కృపాపారవారా శుభవ్యాళహారా

సమస్తోపచారా సమగ్రోపహారా సమార్యాద్విహారా శుభాకార అక్షీణ
కారుణ్యవీక్షా సురద్విట్విపక్షా సదాభక్తసఖ్యా జగజ్జాలరక్షా కళాస్పష్టిద

—(*) శిలాదుఁడు భవుని మెప్పించి పర్వతనం
దీశ్వరులఁ బుత్త్రులఁగాఁ బడయుట. (*)—

క్షా తమఃపాశమోక్షా మరుత్కల్పవృక్షా విరూపాక్ష ఈశా శివవ్యోమ
కేశా తమద్దేవతేశా మహాంహఃప్రణాశా విశాలప్రకాశా నగేంద్రాత్మజే
శా మహేశా గిరీశా నమస్తే నమస్తే నమస్తే నమః॥ (వ) అని స్తుతియించి
యిట్లని విన్నవించె॥ (క) కులదీపకుఁ డుదయించినఁ। గులమునకు సౌఖ్యం
బుదెచ్చు గోత్రము మనువున్। కులనాశకుఁ డుదయించినఁ। గులమునకప
కీర్తి దెచ్చుఁ గుజనులు వెగడన్॥ (క) నీపాదభక్తియుక్తుల। నోపరమే
శ్వర కృపాబ్ధి నొసఁగుము సుతులన్। నీపాదభక్తియందును। ఏపాటిగొ
అంతవైన నేవరమొల్లన్॥ (వ) అట్లు కులదీపకులు శివధర్మపరాయ
ణులునైన కొడుకులఁ గరుణింపుమని వరంబు వేఁడిన నమ్మహాదేవుండును ద
నదమాంశంబునఁ బర్వతనందీశ్వరులను బుత్త్రుల నయోనిసంభవులంగా
ననుగ్రహించి యంతర్ధానంబు సేయ నమ్మునీంద్రుండును దనధర్మప
త్నిచేతికి నకుమారుల నిచ్చి సంతోషామృతాంబుధి నోలలాడుచు నను
దినప్రవర్ధమానాంగులుగఁ బోషింపుచుండిరంత॥ (క) శివధర్మశ్రవ
ణనంబుల। శివయోగధ్యానభక్తిఁ జేతఃప్రీతిన్ । శివమంత్రపఠనరతు

—(*) నందీశ్వరుండు హరునిఁ గూర్చి తపంబు చేయుట. (*)—

లను। శివుఁ బూజింపుదురు మౌనిశిశువులు వేడ్కన్। (క) అంతట నందీ
శ్వరుఁడు ని। రంతరసద్భావనాంతరంగస్థితిశు । ద్ధాంతఃకరుణుండై శి
వు। మంతనమునఁ దపము చేసె మౌనులు పొగడన్॥ (క) అష్టాంగయోగ
భక్తివి। శిష్టాచారప్రసిద్ధసిద్ధాంతకథో। ద్దిష్టజ్ఞానామృతసం। తుష్టిప్రము
దంబుఁ బొందె ధూర్జటిఁ బొగడెన్॥ (క) నిరుపమ నిత్య నిరంజన। నిరవయ
వాదిస్వరూప నిత్యానందా। నిరుపాధితత్త్వనిర్మల। నిరవధినిర్లేపరూ

పనిఖిలాధీశా॥ (శా) సాధ్యుండై నిను నేయ వచ్చినమరుణ్ సాధింపక త్యంతమున్। మధుస్థంబగుదృష్టిచేతనతనిన్ మదీలింపఁగా నేర్చియో। గిత్యోతుప్రతిభాకటాక్షమునకున్ గీర్వాణులున్ నిల్తురే।విధ్యాదుల్ భవదున్నతుల్ పొగడఁ బ్రాపీణ్యక్రియాయుక్తులే॥ (చ) అహాగహముల్ బికంబులునుఁచలుఁగొల్వగనుబ్బి మారుఁడా।తహాతహాదీరనించువిలుఁడాయఁగబాణముఁగూర్చికోయిలల్। కహాకహానాదముల్ చెలఁగఁగ్రన్ననచేసీయనంగుఁడయ్యెఁబో। యహహా భవత్ప్రతాపములనల్పులకున్ దెలియంగశక్యమే॥ (ఉ) దేవభవత్పదాబ్జయుగ దీపితభక్తియకోరు డెందమున్ వారిరిఁగోర్కులున్నొనవవాకొలువున్నదియాశ్రయిస్సితు। త్రావని రోయుచుండుఁ బితోపము నొందెడు నిక్కి వాంఛకున్। భావమునిండ నీదు పదభక్తియు నాకు ననుగ్రహింపవే॥ (ఉ) పంకజగర్భవంద్య శివ భక్తగణప్రియ విన్నపంబు నా। వంకఁ గృపాసుధాదృష్టిపరివర్తితతుష్టి యొనర్చి నన్ను నీ। వింక గణాళిలోన నొక లెక్కనుగా దయఁ బ్రోవు మయ్యరి। శ్శంక వృషాంక కింకరవశంకర శంకర శాంకరీప్రియా॥ (క) చతురంతరయోగములన్। జతురామ్నాయాగమోక్తప్రసన్నుతులందున్। జతురాననవంద్యుని నతి।చతురప్రియులందుఁగొలుచు జనులు నుతింపన్॥ (క) పంచమబీజాక్షరములఁ। బంచప్రణవముల మూల పంచాక్షరిచేఁ। బంచబ్రహ్మములందును।బంచ స్తవములను బూన్చుఁ బంచశరారిన్॥ (క) షడ్విధభక్తిస్థితి నరి। షడ్వర్గంబులను గెలిచి షట్స్థలవిదుఁడై। షడ్విధములైన యధ్వలు। షడ్విధపద్మముల దాఁటి శంభునిఁ గాంచున్॥ (క) సప్తద్వయలోకాధిపు। సప్తాశ్వహిమాంశనేత్రసారసుజలభూ। సప్తార్చిముఖాసూతిని।సప్తముఖాధీశసఖుని శంభునిఁ దలఁచున్॥(క) అష్టాంగభక్తిరతుఁడై।యష్టవిధార్చనములందు నతికుశలుండై।యష్టద్వయోపచారము।లష్టతనుప్రభున కొసఁగు నచలితభక్తిన్॥మతి యుసు॥ (ఉ)అంధకగంధసింధురమదాంధజలంధరదానవచ్ఛటా।బంధధురంధర ప్రమథబాంధవ పంకజబంధువంద్యసా।

గంధికగంధిదేహాయుత కంధిబిల్వాగరు కస్తూరీఘనసారసుగంధానుకీర్ణభక్తజన బంధుర శ్రీగిరికంధరాలయా॥ (శా) గంగాతోయరుహాగతభ్రమరికల్ కణోద్ఘాత్పలామోదసం।సంగప్రేమ వహింప నభ్రతటినీ చంద్రావనా చూటికా।రంగోత్పుక్రమకేళిమంతనకధారంభంబు లంచల్గినన్ । శృంగారాంగి భవాని వేడు తగవల్ చింతింతు గౌరీశ్వరా॥అని మఱియును॥ (సీ) తరుణేందుధరుబృహ దారణ్యకబృహదుపనిషద్వాక్యస్తుతులఁ దలఁచు । సన్నుతించునుశివసంకల్పసూక్తుల శ్రీరుద్రసూక్తులశివునిమహిమ।రతిపతిధ్వంసు నారాయణబ్రహ్మోపనిషదుక్తులను నహర్నిశముఁ బొగడుఁ। గైవల్యజాబాలకా లారిరుద్రోపనిషదర్థముల నీశునియతిఁదలఁచు।వేదపాద స్తవంబుల విశ్వనాథు । సన్నుతించుచుసేవించు సంభ్రమమున।నచలితంబును దుష్కరమైనతపము । సలుపఁబ్రత్యక్షమై నిల్చె శంభుఁడంత॥ (సీ) సిగ్గులుఖండించుఁ జిగురుకైదువసామి కట్టడికానిఁ బోఁదట్టినాఁడు । వడిగలఱాయంచ వారువంబులరౌతు బండిరొప్పెడుపనిఁ బంచినాఁడు।కడలిరాయనికినిగల యల్లుఁదిలకంబు వింటికినమ్ముగా వించినాఁడు । రంతుగావిహరించు రాకాసిపల్లెలు నవఖిలంబుగఁ జిల్లులాడినాఁడు । జహ్నుతీర్థార్ధజములు వెదచల్లినాఁడు । కంఠకోణంబు విషమసికాళిమంబు।మెఱపుకస్తూరికారేఖ యొఱపువాఁడు। అభ

—(*) ప్రత్యక్షంబైనయీశ్వరునినందీశ్వరుండు స్తుతించుట. (*)—

వుఁడనుకంపమెచ్చి ప్రత్యక్ష మయ్యె॥ అంత॥ (క) ప్రమదాశ్రుబిందువులుముఖ । కమలంబున దొప్పఁదోఁగఁగానంద్రీశుం । డమరగణపరివృతుండగు।శమనారాతికిని జరఁజాఁగిలిమ్రొక్కెన్॥ (గీ) అట్లు ప్రణమిల్లి మఱియును సాష్టాంగమెఱఁగి । నిలచికెంగేలుఁగీలించి నిటలమునను। సుఖమునొందుచుఁ బులకకంచుకితదేహుఁ। డగుచుఁబరమేశునిట్లని యభినుతించె॥ నిరోష్ఠ్యగద్య॥ జయ జయ సకలకల్యాణరత్నరత్నాకరా। సకలనిర్జరనికరశరణ్యా। శ్రీశైలహాటకాచలకైలాస కంధరసదనసంతత

సంహారా। జలజాసన సహస్రాక్ష ధనంజయ జలంధర నిశాట సదాగతి ధనదాధి నిఖిల నిర్జర శిరఃకిరీట రత్న చకచక చాంచల్య స్థగితచరణసరసిజా। కీర్తిఘనసార గంధిత నిఖిలాజాండ కరండా। యఖండిత కరదండ శైలకాండాసనా। ఖండశశాంకశేఖరా। అండజనాయకాలంకారితగండస్థలా। కనకకంకణఝణఝణా తాండవనటనటచ్చంచరీకాంగనాహస్త హల్లకాలింగితశరీర। దరహాసచంద్రికాసాధిత। సకలకల్యాణసంచయసంచితా। నిఖిలఖచరకిన్నరనిర్జరాధినాయకా। శ్రీశైలనాయకా। సనకసనందనాదిసంయమీంద్రసిద్ధచిత్తసరసిజకర్ణికాస్థానకనకాసనాసీన। నీలజలదచంచరీకా। శక్రరత్నరాజరాజితహాలాహాలకంధరా। నిర్జితజలంధరా। కటిస్థానసన్నద్ధానంతకాంచీరత్నకింకిణీనాదనాదిత। నిఖిలాచలకంధరాంతరాళ। సంధ్యాకాండనటన్నాట్యాలంకార। లాలితరత్నకటకఘటితచరణతాళనదళిత। ధరాతలనిటలతటకటాక్షేక్షణక్షణికనగరదైతేయ। అక్షీణనక్షత్రరాజగృహరాజనయన। అక్షరాక్షయాద్రీంద్రకన్యకాదత్తదక్షిణేతరదేహ। ఘటికాచలనాజస్రసహస్రనిస్సాణ। శంఖకాహళకాహళీఝర్ఝరఝల్లరీఝురాఝానకఘుఘూరికాఘంటఘణఘణానాదనినదిత। నిఖిలధారాధరకంధరదశశతకిరణనిచయదళిత। నిశితజలజశిశిరఖరకరసంకాశ। త్సారాలంకారితకల్యాణశరీర। నిజచరణాగ్రకరఘట్టఘట్టితకరినాంధకాదినిఖిలరాక్షసశిరస్సరసిజనికాయ। సకలజగద్రక్షా। కారణదయాకటాక్షా। శతసహస్రలక్షణానంతసంఖ్యాతజలజసంజాతాండశ్రేణికారత్నఖచిత కరకాఖాంకిత। హారాంగదకాంచీకటకాలంకారితకంధరా। శ్రీచరణసారసనిశ్చలజ్ఞాన నిరతిశయధ్యానధారణానిశ్చలితాంతఃకరణ। కణ్వకణాదనారదధాత్రీగర్గాగస్త్యచిత్రఖండశిలాదాదిసంయమీంద్రచిత్తాంతరారాధనక్రియారాధ్యచింతితార్థసంతతదానచింతారత్న। త్రిదశగంగాతరంగిణీలహరికాసలిలసంక్షాళిత కనత్కనకశతల్లతాచ్ఛాయాచ్ఛన్నజటాజూటాగ్రదిగ్గ్రథితచంద్రరేఖాగళత్రిదశాసన రసాసారధా

రారక్షిత । హరస్థితసరసిజాసనశిరఃకథితహరలీలాకథానంతకంపకలిత చిత్తసరసిజసిశ్శంకనిమగ్నశంకనియుతనిశ్రేయసస్థానాగ్రసహోజాండభూర శైలహారధరిత్రీగగనతాళ । లింగాత్మసహస్రేక్షణకానవగజాననగజక ర్ణాశంఖకర్ణగోకర్ణాదిసనాతనగణాళిసదారాధనక్రియాధ్యేయవిభా వన చంద్రచంద్రికారాజిత గిరిరాజకన్యకానయన । హల్లకసిజదేహజ లధిజనితజగజ్జాలతరంగ శ్రీశైలలింగ నతి స్తే నతి స్తే నతిః॥(వ)అని యు ల్లు వినుతించి పునఃపునఃప్రణామంబు చేసి యిట్లని విన్నవించె॥

—(*)శివుండు నందీశ్వరుని వాహనంబుగాఁ గొనుట (*)—

(క) ఆపద్మజాండబుద్బుద। రూపములు జనించు నీదు రూపాంబుధిఁ దద్రూపంబును ధరియింపఁగ। నోపిన సత్వంబు నాకు నొసఁగఁగ వలయున్॥(క)నాదేహము నిత్యంబును నీదేహముఁ గదసి చెరపి నిను భరియింపన్। నీదివ్యవాహనముగా। నో దేవాధీశ వరము నొసఁగుము నాకున్॥(వ)అని విన్నవించిన నానందీశ్వరునకు సర్వజ్ఞత్వంబును ప్రమథగణాధిపత్యంబును నిజవాహనత్వంబును ననుగ్రహించిన నది కారణంబుగా నమ్మహాదేవుండు నందివాహనారూఢుం డయ్యె నందీశ్వరుండు తపంబు సేయు పుణ్యమహత్త్వంబున నంది మండలం బనంగ నతిపవిత్ర స్థానంబై వెలసె నందు వర్తించు సమస్తజంతువులకు భోగమోక్షసౌఖ్యంబులుసిద్ధించు వెండియు॥(క)శ్రీపర్వతమాహాత్మ్యము। భూపావన

—(*)పర్వతుం డత్యుగ్ర తపంబు సల్పుట.(*)—

మఖిలలోకపూజ్యంబు మహా। పాపప్రణాశనము విను । మా పుణ్యుఁడు తపము చేసె నతులితభక్తిన్॥(సీసము)జగతి వర్షాదివేషవ్రతములు గొన్ని పర్ణభక్షణమున బ్రతుకుఁ గాదె।అవనిపైఁ దారావతాదివస్తువులు శిలావితతి భక్షించి జీవింపఁ గాదె।సకలపన్నగపురస్సరజంతువులు గొన్ని తెమ్మెరల్ గ్రోలి వర్తిల్లఁ గాదె।సలిలసంచరమీనసస్యాదులకు నెల్లఁ దోయంబు వలన సంతుష్టి గాదె।యనుచుఁ జలోపలాసిలాహార వృత్తి। మెలఁగు మౌనుల తపములు మెచ్చ సేట్లు। ధాత్రిపై నిరాహా

యుండుఁ గోరెలఁ దుమ్మిచి తింపుగూడియాడ। నవకమ్మైసిలిచి యానం దాంకురంబులు పొడముచై వడిమేనఁ బులకలమర । నానందజలధార లాణిముత్యంబుల హారాళి రేవల ననుకరింప । గద్గదస్వరయుక్తకంఠంబు శోభిల్లఁ దద్గతచిత్తుఁడై తత్క్షణమున। నిట్లుహృదయంబులోనున్న యీశ్వరుండు । ఎదుటఁ బ్రత్యక్షమైన మునీంద్రసుతుఁడు । పుడమి సర్వాంగకంబుగఁ బొందమ్రొక్కి । కీర్తనము చేయఁ దొడఁగెఁ గేంగేలు మొగిచి ॥
విశ్వదండకము॥ శ్రీశైలసామ్రాజ్యసింహాసనాసీన శ్రీమన్మహాదేవ సర్వజ్ఞ సర్వేశ సర్వామరాధీశ సమ్యక్స్వరబ్రహ్మరూపా విరూపాక్ష జటాస్వకీయాస్వచంద్రప్రభాభాసమానాద్రిపుత్రీ విలోలాక్షికల్హారసంభావితానేకవిస్రంభపూజావిధారంభ విశ్వంభరాంభోజగర్భాదికుంభోద్భవ

—(*) సాక్షాత్కరించిన శంభునిఁ బర్వతుండు స్తుతించుట. (*)—

శ్రీగణాశ్రిత శ్రీపార్వతీదేహవల్లీమతల్లీ సమావేల్లితస్వచ్ఛమందారఖ్యం దారకాధార వేదాంగనాథారుహా స్తద్వయా హేమకేయూరమాణిక్యరాజత్క్వణచ్ఛ మహోద్ధూతవాతస్ఫురత్కుంతలా కంతుసంహార చండీశ్వర స్తూయమానా స్వసామర్థ్యబాహాబ్జసలాలామమానాభ్రివర్గాత్రికదార్ఘదిగ్లోకజాసంఘాతులింగాడుసానందసద్భక్తసంఘాత భృంగీశనాట్యక్రియానంద నందీశహస్తాంబుజోపేత వేత్రాగ్రసంవారితానేకగీర్వాణసందోహ హాలాహలోల్లాస కైలాసశృంగస్థలీవాస నాకమర్త్యపాతాళయసంఘాతసర్వాపరాధంబులం గాచి రక్షింపవే దేవనీ నిర్మలల్ పుణ్యతీర్థాళి నీకృత్రిమంబుల్ సమస్తామరశ్రేణి నీబాహునిశ్వాసముల్ వేదముల్ నీదు లీలావినోదంబు లీలోకజాలంబు నీదేహవారాశిలో లోకవీచీకదంబంబు లావిర్భవింపంగ నప్ప ద్బ్రహ్మాండంబు లోనున్న బ్రహ్మాదులా నీమహాత్మ్యంబు వర్ణింపఁగా నేర్తురే దేవ నీభూరిలక్షాధారువిక్షేపమార్గాంబునన్ బ్రహ్మాండంబు లెల్లన్ సముద్భూతరక్షోన్నతిం జేయుచున్ నీవర్తిల్లుచు హింపంచు కార్యంబు లెన్నంగ శక్యంబె యీముష్మ

స్వమాహాత్మ్యంబుఁ గానంగ బ్రహ్మాదులు నేరరన్నఁ మనుష్యాదులెబ్భం
గుల నెఱుఁగ నేర్తురే దేవ యాగంబులుఁ జ్ఞానయోగంబులుఁ గర్మయో
గంబులుం గోటిలక్షాదులుఁ భక్తికిఁ సాటిగా లేవు నీభక్తికిఁ గూర్తు
నీభక్తికి న్నిల్తు నీభక్తియోగంబు నీమెచ్చు నీభక్తి నాకుం బ్రసాదించి
రక్షించు నాతల్లి నాతండ్రి నాదాత నాయిష్టదైవంబు నాదేహసంర
క్ష నాయిమ్మ నాసొమ్మ నాపట్టుఁగొమ్మన్ మహాదేవ నీవే దయన్
బ్రోవవే యెంతు భావింతు సేవింతు దేవా నమస్తే జగద్భూతహేతో
నమస్తే దయాంభోధిసేతో నమస్తే దయాబ్ధే నమ స్సోపలబ్ధే నమశ్చం
ద్రివేణే నమ శ్శూలపాణే నమో నందికేతో నమః పుణ్యహేతో నమో
నిత్యశక్తే నమ స్స్వైరశక్తే నమో మంజుకాంతే నమ స్సత్యశాంతే నమో
నంతభూతే నమః పూతగీతే నమో ధర్మయుక్తే నమ స్సూనృతోక్తే
నమో విశ్వస్రష్టే నమో దివ్యదృష్టే నమో భక్తబంధో నమః పుణ్యసిం
ధో నమో భవ్యమూర్తే నమశ్శుభ్రకీర్తే నమః పుణ్యవర్తే నమః
పార్వతీశా నమ శ్శ్రీగిరీశా నమస్తే నమస్తే నమస్తే నమః॥ అని స్తుతియిం
చి యిట్లనియె॥(శా) క్షీరాంభోధితరంగరింగితపరిక్రీడాకళాగర్భవి।
స్ఫారోల్లాసిమరాళ మాచవిటిగుంతఁ జేరఁగాఁ గోరునే। ధీరుండైన భ
వత్పాదాబ్జయుగళీదివ్యామృతాస్వాది ని।స్సారం బంచుఁ దృణీకరించును మ
రుత్సౌఖ్యంబు లాసించునే॥(శా) నీశతాబ్దామృతసౌఖ్యము న్మరగియు న్నాది
వ్యవిజ్ఞానని। ష్ణాతుండైన భవత్పదార్చకుఁడు సంసారంబు కాంక్షిం
చునే। చూతస్వాదుఫలోపభోగములచే శోభిల్లు కీరంబు దా।జేతః ప్రీ
తిం జేఁగు బంటిరసముఁ సేవింపఁగా నేర్చునే॥
(శా) రాకానిర్మలచంద్రచంద్రికఁ జకోరం బాత్మసంతుష్టిగా। నా
శాంతిఁ భుజియించుఁ గాక తిమిరం బాసింపఁగాఁ గోరునే। నీకుం ద
క్కిన భక్తియుక్తుఁ డెవ్వఁడుఁ నీపాదసౌఖ్యార్థియై। యాకంజాతభ
వాదిభోగములు నల్పాల్పరంబులఁ గోరునే॥(మ) కరిపోతంబు తదీయమా
తృకుచ మాకాంక్షించుఁ గాకెట్లు సూ। కరవత్క్రోడమహాదుగ్ధధారల కు

దిగ్ గామించునే దేవ నీ। చరణద్వంద్వపయోజభక్తి కల నాసౌఖ్యామృ తాస్వాదిని। జఠరరాజ్యాదికదివ్యభోగముల నిస్సారంబులఁ గోరునే॥ (వ) భక్తికంటెను ముక్తిసాధకంబును నీకంటె నధికంబు లేదు గావున నీపాదపద్మంబుల మీఁది భక్తియుం దక్క నా మనం బన్యవరంబు గోర దు నా విజ్ఞాపనంబు విన నవధరింపు మని యిట్లనియె ॥ (క) మందర కైలాసాచల। కందరముల సకలదేవగణములనిముసో। మందిరపుణ్యస్థాన

(మహాదేవుండు పర్వతుని భక్తికి)
(మెచ్చి యతని యందాశీర్వదించుట.)

ము। లొందక నా శిరమునందె యుండఁగవలయున్॥ (వ) మేరునగంబు మొదలైన పుణ్యపర్వతంబులు సకలదేవతామునీంద్రహృదయారవిందం బులు సత్కృద్విహారస్థానంబులు గావించి నా శిరంబునందు సకలదేవతా మునిగణసమేతంబుగా లింగాకారంబు దాల్చి పర్వతలింగంబన నవినా భావసంబంధంబునం బ్రీతిదుభవింపవలయు నిన్ను దర్శనస్పర్శనపూ జావిధానంబుల నర్చించువారికి నైహికాముష్మికసౌఖ్యంబులును నిత్య కైవల్యభోగంబులు ననుగ్రహింపవలయునని వరంబు వేఁడిన నమ్మునీం ద్రునివచనంబుల కత్యంతసంతోషవికసితహృదయారవిందుండై యమ్మ హాదేవుండిట్లనియె॥ (క) నీవిపుడు మమ్ము వేఁడిన। యీవరము పరోపకా రి హేతువు హితముగ్। గావున నిక వొండడుగుము। ఏవాంఛితమైన నీకు నిచ్చెద ననఘా॥ (గీ) అనఁ బరమేశ్వరునకు సాష్టాంగమెరఁగి। యంత కంతకు సంతోష మతిశయిల్లఁ। గరపుటాంజలి నిటలభాగమునఁ జేర్చి। ప్ర మథనాయకు నిట్లని స్తుతించె॥ (క) విశదహిమధామధరునకు। గుశరు హాగభాగాదిమౌనికులవంద్యునకున్। బశుపతికి భక్తపరిషద్వశునకు శ్రీ లింగచక్రవర్తికి జేజే॥ (క) రుక్మాంకధరునకును ముని। పృశ్యాకారుడ తునాదిదేవునకు జగ।ద్దృశ్యాదిఫలదమూర్తికిఁ। బశ్యన్నిటలునకు శైలభ ర్తకు జేజే॥ (క) మహితహిమకిరణధరకృ। ద్దహనాకాశానిలాంబు త

ర్వాణిమిళ। వృషభవిధరక్ష భవాండౌ। వ్యవహారవశు శ్రీలింగచక్రవర్తికి జే
జే॥ (క) హారునకు నతశతమఖముఖ। హరపరివృఢమకుటఘటిత శుభా
మోఘ్రి స్ఫురితపదకమలునకు గణావరునకు శ్రీలింగచక్రవర్తికి జేజే॥
(క) లాలాటనయనహుతభుక్। కీలాలాసిక్తమీనకేతనునకు సత్కీలాలా
జసంభవమునిపావనకతటకును శైలభూతజకు జేజే॥ (క) శర్వాయక
మలజాతకు। పర్వతప్రముఖానుపాలపాండిత్యకళా। ఖర్వాయితే నమో
మహా। సర్వాచీనాయ తేన మోమ్మృతనిధయే॥ (వ) అనిస్తుతియించిమూ
డులోకంబులంగల పుణ్యక్షేత్రంబులు పుణ్యతీర్థంబులు పుణ్యనదులుం
బుణ్యాయతనంబులును నావిర్భవింప మూర్తిమంతంబులై పుణ్యము నీం
ద్రిపతితంబుగానుండ ననుగ్రహింపుము త త్తీర్థంబులు దర్శించినవా
రికి నభిమతార్థంబులును స్వర్గాపవర్గాదిసౌఖ్యంబులును గరుణింపవ
లయునని వరంబు వేడిన నమ్మునీంద్రునివచనంబుల కత్యంతసంతోషాయ
త్తచిత్తుండై మహాదేవుండిట్లనియె॥ (క) నీవిపుడు మమ్ము వేడిన। యీ
వరము పరోపకారహేతువు హితమౌక। గావున నీక నొండడుగుము।
శ్రీవాంఛితమైన నీకు నిచ్చెద నపఘా॥ (గీ) అనినఁ బరమేశ్వరునకు సా
ష్టాంగమెరఁగి। యంతకంతకు సంతోష మతిశయిల్లఁ। గరపుటాంజలి నిట
లభాగమున మొగిచి। ప్రమథనాయకు నిట్లని స్తుతించె॥ అక్షరగద్యము॥
అఖిలలోకాధార। అనందరసపూర। ఇనచంద్రశిఖినేత్ర। ఈ
డితామరగాత్ర। ఉరులింగనిజరూప। ఊర్జితాచలచాప। ఋ
క్షాంకకోటీర। ౠపజితోదార। ఌళితతాండవకాండ। ౡనికృతా
ఖండ। ఏకశైవల్యేశ। ఐశ్వర్యనిర్దేశ। ఓంకారదివ్యాంగ। ఔన్నత్యగణ
సంగ। అంబికాహృదయేశ। అస్తోకకలినాశ। కనదహీనాభరణ। ఖలజలం
ధరహరణ। గణనాయకవిధేయ। ఘనభక్తివిజ్ఞేయ। ఙస్థూలకాలహర। చ
తురత్రిశూలధర। ఛద్మయాగధ్వస్త। జలజశరోహస్త। ఝుస్ఫూర్తి
శృంగార। ఞవిభుగుణాధీర। టత్రయాధినిర్దారితప్రభాభాకార। డమరు
నాదవిహార। ఢక్కావాద్యపరికర। ణప్రభాతక్యాత। తత్త్వరజనోపేత। థపద

హితజనపక్ష।దహనఫాలకటాక్ష।ధరణీరథోల్లిథ।నందికేశారూఢ॥పర్వ
తేశ్వరలింగ।ఫలదనేత్రాపాంగ।బహుళభూతివిలాస। భక్తహృత్పేరవా
స।మంత్రస్తుతోదార।యక్షరుద్రాకార।రతిరాజవిధ్వంస । లలితగం
గోత్తంస।వరదశీలవిశాల । శరసంభవస్ఫాల।షట్త్రింశదుపరిగత। స
కలసురమునివినుత।హరినేత్రపదపద్మ।దళితభూధరపద్మ । త్రిపురహిత
చారిత్ర।అత్యుదోక్తస్తోత్ర।శ్రీపర్వతమహాలింగమహాదేవ నమస్తే నమస్తే
నమస్తే నమః॥ అని వినుతించి మఱియును॥ ( మ ) ధరసాష్టాంగము
లొందఁ బ్రమోదిఁగ మఱియున్ దండప్రణామంబుతోఁ । కరముల్ మో
డ్చఘటించి నిల్చి సుమనః కల్యాణసంధాయి తే। పురదక్షాధ్వరఘస్మరా
య కరుణాంభోరాశయే శూలినే। గిరిజేశాయ నమశ్శివాయ యను
చు న్నర్తించి యత్యున్నతిన్॥ ఇట్లని విన్నవించె॥ (సీ) సన్మునిబ్రాహ్మ
ణక్షత్రియవైశ్యాదికులవంతులైన దుష్కులజులైన। నెట్టి మానవులైన
న నీశాన మామకశిఖరాగ్రసంవీక్ష సేయు నరుల। పూర్వజన్మార్జి
తోద్భూతకర్మంబులఁ బరివృతంబగు మహాపాతకములఁ। బొలియించి
శుభ మిచ్చి పుణ్యదేహులఁ జేసి కైవల్యనిత్యసౌఖ్యంబు లొసఁగు।సర్వ
సర్పాంసహారధర శర్వ సర్వ । కమ్రవిమార్థీనసుజనసంకల్పభూజ। కా
లకాలాఖ్య శివ కలకంఠకంఠ । సోమసోమార్ధధర బుధస్తోత్రపా
త్ర॥ (క) నామీఁద జంతుసంఘము । నామీఁదఁ బ్రాలుఁగట్టి నగసం
ఘములన్। గామితముక్తిఁ ధూర్జటీ।ధామాధిపులై సుఖింప దయచేయు
శివా॥ (వ) నాశిఖరంబుఁ జూచిన నిఖిలమానవులకుఁ బునర్జన్మంబు
లేక జన్మాంతరంబులం గల పాతకంబులు తొలంగి భోగమోక్షంబులు
పొందు నట్లుగా నాశిఖరదర్శనస్పర్శనముక్తిసత్రంబుగా ననుగ్రహిం
పవలయు ననిన నమ్మహాదేవుండట్లండు వేఁడినమూఁడువరంబుల నొసం
గ సకలతీర్థంబులనుండ విస్రుతంబుగాఁ బర్వతాకారంబుఁ దాల్చె నప్ప
ర్వతంబుమీఁద నమ్మహాదేవుండు పర్వతలింగనామంబునఁ బ్రాదుర్భ
వించె బ్రహ్మాదిదేవతలును దత్ప్రదేశంబున నధివసించిరి కైలాసశిఖరి

యును శ్రీ ముక్తిమస్తుసారనీలాచలంబులును మైనాకమాణిక్యమహేంద్రమ హీధరంబులును సైంధవకల్యాణసారంగసహ్యగంధమాదన కింశుకశ్వే తమాల్యవంతంబులును ఉదయగిరివర్ధమానవిద్యుత్ప్రకాశనిషధపుష్ప శైలంబులును చిత్రకూటహేమకూట క్రౌంచశైలోవనపర్వతంబులును ఋష్యమూకేంద్రకీల మలయారోహణ పూర్వవింధ్యనగంబులును మాన సోత్తరాద్రికులరాజ్యకేశశిలోచ్చయంబులును గోవర్ధన శతమేరుకం జకమేచక పారియాత్రాది గోత్రంబులును మఱియు భాగీరథీపాతా ళగంగా- పంచనద- గాయత్రి - శతద్రు-శోణ వేదవతీ- శుక్లపరిధాన వేణీశ్వర- కుమారకృష్ణవేణీ- మలప్రహారి - సౌగంధికాదితీర్థంబులును విరజ కౌశిక గాంధార గంధవతీ కావేరీ వరుణతుంగభద్రాప్రయాగ కాశీసరస్వతీభోగవతీనర్మదా యమునా గయా తామ్రపర్ణీగోమతీ

—॥హరిబ్రహ్మలు పర్వతలింగంబును బరివేష్టించి కొలుచుట.॥—

సోమప్రభాసనందనసరయూవైతరిణీ వేగవతీ చంద్ర ప్రభామహా నదులు మొదలైన పుణ్యతీర్థంబులును పుణ్యనదులును దత్తత్ప్రదేశం బులఁ బ్రవహించె మఱియును॥(క) శ్రీగిరిశృంగపు మస్తకభాగంబున శి వుఁడు నిలువ బ్రహ్మాచ్యుతులుఁగ। నాగాప్సరమునిఖచరులు। వేగమ వసి యించి రఖిలవిబుధప్రముఖుల్॥(గీ) స్థాణునవమూర్తికచ్ఛత్రధరులలోన। వరుస నింద్రుఁడు ఛత్రంబు పట్టి కొలువ। సరస విహరించు తలవరి జ నులలోనఁ। జాల బల్ల యంచు నిచ్చలు జముఁడు గొలుచు॥(సీ) పర్వత స్థానాధిపతులలో నొనగూడి కరిముఖషణ్ముఖు ల్గదసి కొలువఁ। బర్వత నందిమహాకాళగణములు ద్వారికులలోన దరసి కొలువఁ । బర్వత ప్రాంగణపరిచారకులలోనఁ బాయక నిర్ఋతి పనులు సేయఁ। దాండ వక్రీడావిధానతత్పరులలో నిలిచి యీశానుండు నృత్యమాడఁ। దిండితో త్తమనటవిప్రతతిలోనఁ। గీతిఁ జండీశ్వరుండును గీతి సేయఁ। జం ద్రికండాంశుతారకజ్యోతులనచయాషు। ఖండదీపంబులో పూఁ గలసి వెలుఁ

గీ॥ (క)అంగజజలంధరాసుర । భంగంబులు నంధకాదిభంజనములు ని।
బ్బంగిఁ బదిరెండు గతులను। భృంగీశ్వరుఁ డాడు భ్రూమి భ్రూంగుపై కేలఁ
వకన్। (సీ)షడ్జంగతిక్రమచతురీక్షణములవిశతచతుర్విధవిభ్రమములు, దో
విలాసములఁజతుష్షష్టిగతులముప్పదిమూడు మస్తకాస్ఫాలనములఁ। ద
రళనవ్రస్వరతానటవ్యాప్తిని దశవిధకర్ణావధానములను । శోభితత్రి
విధవక్షోవిలాసంబులనభిరామమిరుదదియభినయములఁ। దరుఁకేళిహం
సగతులమాతంగగతుల । లీలవాఘ్రాతగతులనువివిధగతుల । నిలిచియు
చ్చురకాంతలునృత్యవిద్య । మెలఁగుచుందురుమర్త్య భామినులఁగూడి॥
(శా) ముక్కంటింభజియించువేళలగతుల్ మ్రోయంగనాట్యక్రియల్ ।
నిక్కంబుగన్ బచరింతురిందువదనల్ నేర్పుగన్ విడంబింపఁగఁ । జిక్కగన్
మదళాలకామాళధ్వనిగతుల్ ఝుంఝుంఝుణత్తత్తతా । ధిక్కంధింధిమిత
కిటతోనకధిమింధీ యటంచు ఘూర్ణిల్లఁగన్॥ (శా) పంకేజాతులన
ర్తనంబు పటహప్రక్వాణవీణారటల్ । ఢంకారార్భటమర్దళధ్వనిధ
మద్ధకాహాదుకాహామహా । ఝుంకారానకజర్ఝరప్రకరఝుంఝుం
ఝుల్లరీనిక్వణ । ఝ్ఝాంకారంబులు మ్రోయ శ్రీనగముపై బ్రాహ్మాది
కాలంబునన్॥ (సీ) మునులలో నగస్త్యముని దధీచ్యాదులు గలసి తమే
పౌ(?)ద్దు శంకరు భజింప । భక్తులలోపలఁ బ్రమథాదిపతు లెల్ల సత
తలింగార్చనాసక్తి నిలుప । సంయమీంద్రులఁ గూడి సరసిజప్రోక్త
లఁ బుండరీకాక్షులు పూజ చేయఁ । బుధ ధేనువులలోన సురధేనువులు

—(*) బ్రహ్మాదులుపర్వతుని శ్లాఘించుట. (*)—

నిల్వఁ దరులలోపలఁ గల్పతరులు బెరయ । నేడు సాగరములను న
వ్యేడు దీవు । లానగోపరిసకలదేశాంతరమున । నడఁగు మల్లోక
ములు సచరాచరములు । బరగు సచరాచరంబుల భాతి గిరిని॥ (సీ)
ఇదియు క్రీడాస్థాన మింక మాకనుచును సనకాదిమునులును సంస్తుతింప ।
గణుతింపఁ బ్రత్యక్షకైలాసమిది యని బ్రహ్మాదిసురలెల్లఁ బరిణమింప ।
శివపూజనక్రమాదిత శతపద్రక్రియలకుఁ జనును మారీలభక్తసమితి మెల్లఁ

శ్రీశర్వతాధీశు సేవింపఁ గంటిమి పర్వతేంద్రు నితపఃఫలమువలన ।
ననుచు సంతోషమున గౌతమాత్రికణ్వ । వామదేవాదినారదవత్సగర్గ ।
మునులు తమలోన సంతోషములు ఘటిల్లఁ । బ్రస్తుతింపుచు నిట్లని ప
లికి రంత॥ (క) శ్రీవాణీశసురేంద్రులు। నీవిధమున నిరుపజేసి నెనిమిది
కోటుల్ । దేవాధికారములుగల। దేవత లీవరము వేడఁ దెలియరు బు
ద్ధిన్॥ (మ) తనయుల్ గన్న శిలాదమౌనియు మహాధన్యుండు సత్పు
త్రులన్ । గనినన్ లోకహితార్థియాటఁ బిత్రువాక్యస్ఫూర్తిన్ ఋం
కెవ్వరున్ । గని పెంపన్ గడు లెస్సగాదె చలమే కష్టంబు దుష్పుత్రు
లన్ । గనదే సూకరి పోతముల్ గరిపరిహారంబు శోభిల్లునే॥ (మ)
కనిరెన్ బుత్రు శిలాదమౌనియ పురాగణ్యుండు మాయయ్య దా।గని
రెన్ బుత్రుని భక్తవర్ధనకళాకారప్రభావోదయున్ । గనిరెన్ బు
త్రుని లోకపావనపరిహారక్రియామార్గమున్ । గనిరెన్ దర్శ
నముక్తిసత్రము ధరంగావించెఁ బ్రఖ్యాతిగన్॥ (ఉ) నెయ్యముతోఁ గు
లద్వయవినిందితులై శివభక్తిహీనులై । కొయ్యతనంబునన్ దిరుగు కొ
య్యల నెన్నఁగ నేల వారలన్ । దయ్యె పెంపుంగు భక్తజనతత్పరుఁ బ
ర్వతపుణ్యమూర్తి మా। యయ్యను లోకపావనుని నాత్మఁ దలంచిన
ముక్తిఁ జేకురున్॥ (క) పరమేశ్వరవిమలకృపా । పరమసుధాసారనీక
పావనమూర్తిన్ । కరుణారసతోయదము।బరహితగుణరత్నవార్ధిఁ
బర్వతుఁ దలఁతున్॥ (గీ) తత్పరత్వంబు సంధిల్లఁ దపముఁ జేసి। శం
భుదేహంబు శాంభవి సగమువడసెఁ। బర్వతుండను మాహితపంబుఁ జే
సి।దర్పకారాతిదేహ మంతయునుబడసె॥ (వ) అనిన వేదవ్యాసుండు
తరువాతి కథావిధానం బెట్టి దనిన సనత్కుమారుం డిట్లనియె॥ (క)
సేవాగతసురకోటీ । రావిష్కృతరత్నకిరణరంజితచరణా । తావకను
తిగంగాఘ॥ పావనితజగజ్జనాంగ పర్వతలింగా॥ (శా) బాలేందుద్యు

—(*) ఆశ్వాసాంతము. (*)—

తిశాలిభాగబలభిత్ప్రత్యర్థివిధ్వంసికా । బాలవ్యాఘ్రహత నేత్రవహ్నిణ

దిశాబాధోధివీచీపయఃఖేలోత్తుంగతరంగరంగితపరిక్రీడానఘస్వద్వసా
స్థూలాంగోరగరాట్ఫణామణికళాశుంభద్భుజామండలా॥

(మాలినీవృత్తము.)

ఖరకరశశినేత్రా గర్వితానంగజైత్రా । సరసధనదమిత్రా శైల
కన్యాకళత్రా । విరసదనుజనాశా విశ్వలోకప్రకాశా । పరమసు
నివేశా పర్వతాధీశ్వరేశా॥

గద్యము॥ ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్టభా
షావిశిష్టశివయోగవర్య శేషనాథార్య ప్రణీతం
బైన శ్రీ పర్వతమహాత్మ్యంబు నందు
ద్వితీయాశ్వాసము.
శ్రీసాంబసదాశివార్పణమస్తు.





శ్రీరస్తు.

శ్రీగణాధిపతయే నమః.

## శ్రీపర్వతపురాణము- తృతీయాశ్వాసము.

(క) శ్రీశైలపుణ్యమహిమము। లాశైలతనూజవినుచు నానంద
సుధా।రాశిరసకేళిఁ దేలుచు। నీశానుఁ జూచి త్రిభువనేశ్వరిపలికెన్॥
(క) శ్రీనగమునఁ గల పుణ్య।స్థానంబులఁ బుణ్యతీర్థతతులన్ దెలియం।
గా నానఁ గృపజేయుము। గానామృతరసవిలోలకరుణాపాంగా॥(వ)
అనినన మ్మహాదేవుండు పార్వతీదేవికిఁ గృపాయత్తచిత్తుండై యిట్లనియె॥

—(*)పర్వతశిఖరాష్టకతత్తీర్థతన్నామతత్ఫలంబులం దెల్పుట (*)—

(సీ) పర్వతభూమి ముప్పదియోజనంబుల వెడలుపు నిడుపుఁ దద్విస్తృ
తంబు। కమ్రజనాభీష్టకామ్యప్రదైశ్వర్యధన్యంబు లగు చతుర్ద్వారము
లును। గామితఫలసిద్ధి కారణసౌఖ్యసాధ్యము లెనిమిది యుపద్వారము
లును। షోడశసంఖ్యాకశోభితాలంకారకర్ణంబులగు గవాక్షములుగలిగి।
భుక్తిముక్తిస్థలోపేతపుణ్యతీర్థ। శక్తిభైరవదేవతాసంయుతేంద్ర। పా
వనాశ్రమశివలింగపరికరాఢ్య। శిఖరశోభావిలాసంబు శ్రీనగంబు॥ (క)శి
రిగిరిశిఖరము లెనిమిది।సరసీరుహభవాండతీర్థసారము లెల్లన్।బరుసగి
లు మాడిపుణ్య। స్ఫురణంబున నితరగిరుల పురులం దెగడున్॥ (క) అ
వ్వెన్మిది శిఖరంబులు। మున్నూనిమిది నదులు సకలమునిసేవకపా । ని
త్యంబులకలిమి నిగమ।నియ్యామృతరసవిభాతి నెలకొనియుండున్॥వచ
నము॥ మొదలిశృంగంబున సానందియునందియు- శుక్లయు - ననునా
మంబులుంగలిగి తీర్థత్రయంబు ప్రవర్తించు రెండవశిఖరంబున గోమతి
యుఁ గీర్తిదాయుఁ గళయునను నామంబులుం గలిగితీర్థంబు ప్రవహించు
మూడవశిఖరంబునఁ దామ్ర- జాహ్నవియు-విచిత్రయుననుతీర్థంబులు

సంధిల్లు నాలవశిఖరంబునసర్వారతియుఁ గౌరీ ఘోషవతియు నరుణియు న
నుతీర్థంబులెల్లకిల్లు నైదవశిఖరంబున జ్యోతియు జయయు విజయయు
ననుతీర్థంబులధివసించు నాఱవశిఖరంబున క్రియయు బృధుశ్రవను, పశ్చి
మ్మతియునను తీర్థంబులువిలసిల్లు నేడవశిఖరంబున జ్యోతియు నర్చియుఁ
జతుర్వక్త్రియునను తీర్థంబులువసియించు నెనిమిదవ శిఖరంబున సుభ్ర
వయు క్షేమయు శుక్లయు ననుతీర్థంబులు ప్రవహించుఁ దత్తీర్థంబులఁ
గృతస్నానంబులైన మానవులకు నశ్వమేధసహస్రంబులును వాజపేయశ
తంబును జేయుఫలంబుసిద్ధించు నాశిఖరంబు లెట్టివియంటేని॥ (సీ) వై
డూర్యశిఖరంబు వాసవసేవ్యంబుఁ ద్రిపురాంతకం బనాఁ జెలరిల్లుఁ।
బశ్చిమశిఖరంబు బ్రహ్మేశ్వరంబంచు ముకుళాసనుఁ డందు బరిఢవిల్లు।
మాణిక్యశిఖరంబు మర్త్యగణాకీర్ణ మది మహేశ్వరమందు రథినుతంబు।
వైభవాన్వితము ప్రవాళశృంగంబును బుష్పశైలము మరుత్పూజితంబుఁ।
భావనాకార తాపసప్రకరభాస్వ। దమరవిద్యాధరాప్సరోయక్షసిద్ధ। కి
న్నరోరగగంధర్వఖేచరేంద్ర। సేవ్యమానంబు శ్రీశైలశిఖరరాజి॥(సీ)ఈ
డితస్కంధసోమేశ్వరంబును రౌప్యశృంగంబు నందు వసించు గుహుఁ
డు । మొదలి శృంగము దేవమునిగణోపాస్యంబు వది హేమశిఖరంబు
నభినవంబు। మరకతశృంగంబు మధువైరి నిలయంబు నది మహాకాళ
నాము మతిశోభిల్లు। నానంది మండలం బది వజ్రశృంగంబుఁ బ్రిత ధుల
లోనంది పరిఢవించుఁ। భావనాకార తాపసప్రకరభాస్వ। దమరవిద్యా
ధరాప్సరోయక్షసిద్ధ। కిన్నరోరగగంధర్వఖేచరేంద్ర। సేవ్యమానంబు
శ్రీశైలశిఖరరాజి॥(వ)అని మఱియును॥(సీ)వసుమతి యను మునీశ్వరపు
త్రి సుకుమారి కలహంస గామిని కంబుకంఠి। యప్పర్వతమున నయ్యిం
దుబింబానన తరలాక్షి యత్యుగ్రతపము చేయఁ। బంకజాసనుఁ డంతఁ
బ్రీత్యతుఁడై నిల్చి యంబుజానన వరం బడుగు మనిన। వసుమతి నాపేరు
విసుమాన మిది యొల్ల శ్రీనామ మొసఁగు మీప్సితము నాకు। ననినఁ గ
మలాసనుండు వరం బతి వశోసఁగినట్టి శ్రీదేవి యత్రుడు నీమాద్రి మీఁదఁ

—*కార్తికాదిమాసంబులందు శ్రీగిరికిఁ జనిన కలుగుఫలములు.*—

బవహ తేశ్వరుఁ డాయక భక్తిఁ గొలువ। శ్రీనగం బన జగతిఁ బ్రసిద్ధ మై
తొప్ప (క)మనుజుఁడు కార్తికమాసం బున నిశ్చలతత్పరత్వమున శ్రీనగ
మెక్కి। గనుఁగొనినంత గలుగును। ననఘుం డతఁడు వాజపేయ యజ్ఞ ఫలం
బుల్॥(క)వేసరక మార్గశిరమను। మాసంబున శ్రీనగంబు మనుజుఁడు
గనినఁ। జేసిన దురితము దొలఁగును; భాసిల్లును బౌండరీక బహుమఖఫల
ములల్॥ (గీ)పుష్యమాసంబునందు నేర్పరుఁడైన। పర్వతంబున కేగిన
పావనాంగుఁ। డగును జాతకనిర్ముక్తుఁ డగును బుణ్యు। డతఁడు పొందు
ను నతిరాత్రయజ్ఞఫలము॥(గీ)మాఘమాసంబునందు నేమనుజుఁడైన। శ్రీ
నగంబున కేగినఁ జేర వెలయు। నఘుశపంబుల రాజసూయాధ్వరములు।
సేయు ఫలములఁ బొందు నిశ్శ్రేయసంబు॥(క)కృష్ణకృత్యుఁడైన నరుఁ డీ।
క్షితి ఫాల్గున మాసమునను శ్రీగిరి కరుగన్। హతకల్మషుఁ డగుఁ గలుగును।
నతనికి సౌత్రామణీమహాధ్వరఫలముల్॥(క)మధుమాసంబున శ్రీగిరి। విధి
యుక్తముగాఁగఁ జూచు విమలాత్మునకున్। బ్రథితశుభంబులు చేకుఱు।
నధికం బగు బహుసువర్ణయజ్ఞఫలంబుల్॥(క)వైశాఖమాసమున నా।
శ్రీశైలముఁ జూచు నతఁడు జితమోహాతమః। పాశుఁ డగు నతనిగోవులఁ।
జేశ అమతులకును నొసఁగు పెంపు వహించున్॥(గీ)శ్రీనగంబున కెవ్వం
డు జ్యేష్ఠమాస।మునఁ బ్రయాణంబు సేయున పుణ్యుఁ డతఁడు। వాంఛితా
ర్థంబుఁ గోటిసువర్ణదాన। ఫలము సిద్ధించు సకలశుభంబు లొందు॥
(క)జను లెవ్వరేని నియతం।బునఁ జని యాషాఢమాసమున శ్రీనగమున్।
గనుఁగొనినఁ గోటిగోవుల।నఘమున కపిలించు ఫలము అప్పుడ కలుగున్॥
(క)వెండియు మనుజుఁడు శ్రావణ। కాండంబున శ్రీనగంబుఁ గనుఁగొని
నంతన్। బండితునకు యోజనములు। పండిన చేనిచ్చు పట్టి ఫలములు గలు
గున్॥(క)అతిభక్తి భాద్రపదమున। గతిఁగొలుకును నరుఁడు శ్రీనగంబున
కరుగన్। గుతుకమునఁ గోటిగోవుల। గృతమతులకు నిచ్చు తత్సుకృతము
ను గలుగున్॥(క)అతిశయనియతవ్రతసం। యుతుఁడై శ్రీనగము నాశ్వ

రయుఁజనునఁ జూడఁగ।మహిమంతునకును శేశ్వర। నతివల నవిరంచు ఫలము
హాత్మ్యము గలుగుఁగ॥(క)సిరిగిరి కరిగిన మనుజుం।డరుగును నాందోళిగా
శ్రీపర్వతలింగమునకు నుపచారములు సేయువారికి గలుగుఫలము.
దియానంబునఁ గ।బ్బురగిరికి హేమచామర। వరరత్నచ్ఛత్రముఖ్యవైభ
వయుతుఁడై॥(క)పరమేశు నభవ్యుఁ గమ్మని।విరులఁ బూజించు నతఁడు
విభవము లందుఁ। సురమస్తకవ్రవ్వరజః। పరిషేకోజ్జ్వలిత పాదపద్మా
న్వితుఁడై॥ (ఉ)గంగను దాన మాడి కలకంఠుని శ్రీగిరిమల్లికార్జునిన్।
మంగళగీతవాద్యమహిమ స్తవపాఠము లుల్లసిల్లఁగా। సంగతిఁ బూజ
మర్త్యులకు సౌఖ్యము లిందును నందుఁ గల్గు వా।రాంగన లట్ల చేయు
దు రనంతవిలాసులు ముక్తికామినుల్॥(శా)దుత్తూరంబుల బిల్వపల్లవ
ములన్ ద్రోణాదిపుష్పంబులన్। దత్తశ్వేతలమల్లికార్జునుని నేకస్వాం
తు పూజించినన్।దాత్తు న్వారికి ముక్తికామినులు నస్తోకంబులై శ్వర్య
ముల్।బత్తు ల్పంకజసంభవాదు లివి సౌభాగ్యప్రభావోన్నతుల్. (క)పర
మేశ్వరుఁ బంచామృత। పరిషేకమహోపహారభజనపరుండై। నరుఁడ
పొందు సకలజగతీ। పరివృఢరాజ్యాభిషేకబహుళవైభవముల్॥(క)మల
హాపు గుడి గోమయమున। నలికిన మర్త్యుఁ డందు నలఁదు నటఁ గస్తూరీ।
మలయజపంకము దివిష। జ్జలజాయతలోచనాకుచద్వయవీధిన్॥
(క)శ్రీరాజధరుని రమ్యా।గారముఁ గప్పించి నట్టి ఘనుఁడు సుఖించున్।
దారాచలకంధరశృం। గారపాప్రాదరుద్రగణముల నడుమన్॥ (మ)త్ర
తిపధ్వంస మహేశ శంకర శివా రాజార్ధకోటీర యం। చిరభక్తిన్
బ్రీతుతించు నెప్పుడు మహాయత్నంబుతో నాతఁ డా। చతురాస్యాదిని
లింపపుంగవులు హస్తాంభోజముల్ మోడ్చి సం। స్తుతి సేయఁగ విహరిం
చుఁ దారగిరిపై శుంభద్గుణశ్రీఘుఁడై॥(క)శివ భవ వ ర దయను పఠనా।
రతములు కై వల్యరాజ్యరవణీయమహా। స్పదతిఁ దిమధకా[illegible]నక విని
ధాభిటిరుల్లరినవీనస్వరముల్॥(క)నగరాణ్ణిలయుని దేహము। సగ
ము తపోధనము చేత జట్టిగఁ గాని ను।జ్జగములను వెలసియుండును। న

గమిత శ్రీగిరిని సతతనారీమణులై॥ (క) యుక్తులు నిగమము లావ్యక్త శక్తులు గంధర్వదివిజసారసనయనల్ భక్తులు దివ్యావృతయులు భక్తులు శివశ్యామసురలు భ్రమరాంబికకున్॥ (వ) అర్ధనారీ జీవియును భ్రమ

(*) శ్రీశైలతీర్థమాహాత్మ్యంబులు సనత్కుమారుండు కృష్ణద్వైపాయనునకుఁ జెల్పుట. (*)

రాంబికయును శ్రీశైలంబునకు నాధిక క్షేత్రస్థానంబులు తదీయమందిరంబు లనిస్పృహచిత్తులై తపంబు సేయువారికి సకలమనోరథార్థసిద్ధులు సిద్ధించు మహితము శ్రీశైలతీర్థమాహాత్మ్యం బెట్టిదనిన॥ (క) శ్రీగంగకుఁ దమస్త్రీకి భాగామరదీర్ఘికాంబు పావనకరణ। ప్రాగల్భ్యోన్నతి మెఱయును। నాగద్దిగ భావిపావనాంభఃకణముల్॥ (చ) సమధికభుక్తిముక్తి విడఁజాలిన గడ్డిగ బావి వేణికా। విమలపయఃకణచ్ఛటలు విస్తరలీలఁ బ్రద స్తరించు నక్రమలభవాండమధ్య పరికల్పితపుణ్య వసుంధరాతలోద్గమబహుతీర్థవాలహారి ఘట్టసముద్భవపావనంబులన్॥ (క) ఆ మల్లికార్జునేశ్వర। నామప్రఖ్యాతిపావనస్ఫీతపయో। ధామమగుమల్లిగుండము ధూమిఁ బ్రసిద్ధంబుఁ బొందెఁ బుణ్యోన్నతులన్॥ (వ) తత్తీర్థంబునం గృతస్నానులైన మానవులు ముక్కన్నును జటాభుజంగంబులును మొదలైన రుద్రచిహ్నంబులు గల ప్రమథాధీశ్వరులై సారూప్యపదంబుం బొందుదురు తత్సమీపంబున॥ (క) కుండీమండపభైరవ। ఛండీపరివేష్టిత ప్రశంసితపుణ్యా। ఖండీకృతఘనఘంటా। కుండీతీర్థంబు జనులకున్ శుభమొసఁగున్॥ (క) ఘంటాసిద్ధేశ్వరునకు। ఘంటాంకునవంగశార్వ్యలుంఛనసేవా। ఘంటాపథపరివర్తక ఘంటాకర్ణాఖ్య కర్ణుకరగోకర్ణున్॥ దర్శించి॥ ఘంటికామంజుశుద్ధోదకంబులందు। స్నానము నరించి తల్లింగదర్శనంబుఁ। జేయుఁ జనులు తమ అభిమతసిద్ధులొందఁ బ్రబ్రహ్మహత్యాదిపాతకప్రతతి దొలఁగు॥ (క) కోటితీర్థశీతభానుని। హాటక [illegible] దేవతాధీనమున। ఖ్యాటుపదనిలయాద్రిపురని। [illegible] కోరున్॥ (గీ) భక్తిదర్శించు జనులకుఁ జాతుచరిత। మహిల [illegible] యుల్లు। వరులు తత్తీర్థము

ప్సంగృతస్నానులైన। సకలకామ్యార్థతతులను సంభవించు॥ (క) తుం
డములుపుణ్యతతులు ప్రచండములఘములను దోలఁ జననాంబుజవేదిండ
ములు చంద్రభాస్కర । కుండము లనిశంబుఁ గేలిఁ గొనుఁ బెరన నులన్॥
(క) భావితతాపసతీర్థక। సేవకులకు వాంఛితార్థసిద్ధులనొసఁగున్।
లావుకవరాహకుండే। భావుకవిదిశంఖచక్రభవతుండంబున్॥ (క) దు
ర్మదబహుజన్మాంతర। కర్మోద్భవదురితపాశఖండనకలనా।నిమ
లపుణ్యఫలదము। కమారీశ్వర మభీష్టకారణమనఘా॥ (క) నిమలపు
ణ్యోన్నతిచే। శమదపరఫలవిశేషసామర్థ్యములన్। నిమిషంపఁ జాలు
తీర్థము।కమారీశ్వరము సాటిగలదే జగతిన్॥ (క) హాటకశైలఘను
ర్ధరు।నాటవికప్రకర సేవ్యు నాదివ్యసరి। జూటీకుడుంగసంగుని। హాటకశి
వలింగదేవు హరుని తింపన్॥ (గీ) తొలఁగుదురితంబుశుభములు తొం
గలించు।హాటకేశ్వరతీర్థంబునం దుఁ గ్రుంకి। పంచపల్లవధారాదిభవ్య
తీర్థ।సేవకంబుల నిష్టార్థసిద్ధులొదవు॥ (శా) శ్రీమద్భోగవతీస
తులు నాశ్రీకోటిలింగాచలం। బామందాకినికిన్నరేశసదనం బాపుణ్యగం
గాచల।స్తోమంబున్ శిఖరేశ్వరంబు భువనస్తుత్యంబులత్యాదృతి। ప్రేమం
జూచిన మర్త్యకోటికిశుభాభీష్టార్థముల్ సేకురున్॥ (మ) బహుపద్దో
షలతాలవిత్రములగున్ పాతాళగంగానదీ। జలముల్ ప్రస్తరిసేయు న
కల్మలసంజాతాండమధ్యావనీ। స్థలకేదారగయాప్రయాగసీమప
ద్వారాణసీసేతుమే। కులకన్యా యమునానదీకలిలరంగత్పావనశ్రేణు
లన్॥ (సీ) అనిమిషలోచనయావనసనాభి పృథుగర్భాంగ స్తనఫేన
హార। శృంగారసైకతశ్రీజఘనస్థలివికచపద్మాసనవిద్రుమోష్ఠి। కంబుకం
ధరిమధుకరనీలకుంతలి యంభోజపుష్పరపాంగరాగ। మహనీయకల్లోల
మానికాకరయుగ్మ యభిరామపవకలహంసయాన। గరుశక్తైకదీనా
ప్పుపాతకవిభంగ నగనటోత్సంగ దురితపన్నగవిహంగ। భవశిరస్సం
సేవితపావనాంగ। తరళతరంగ స్తరంగ పాతాళగంగ॥ (క) గంగ
లోపల నక్కలకంఠమూతి। పాదపద్మంబు లుండుఁ దత్పార్శ్వతమున

ను । నఘహరంబగు యమకోణ మనఁగ గలదు।అచట ధర్మరాజుఁ జేసి
న నతపంబు ॥ (క) గతికోఱకు భక్తితత్పర।చతురుండై రుద్రపాద
సన్నిధి నుండుట । బితరులకు నన్న మిడినను। సతతముఁ బితృకోటి క
ధిక సంతృప్తి యగుట్॥ (క) ఆయమకోణము దూర్పున । నాయతమ
హీమమున దూఱు నట మర్త్యుఁడు గాం। గేయప్రాసాదాలయ।భూ
యిష్టపరేత రాజ్యభ్రరలోరణముట్॥ (క) గంగాస్నానము సంతత।పాం
గళ కారణము జనకమాతృకుల వ్యా । సంగదురితాపహరణము । గం
గాస్నానంబు మోక్షగతి హేతు వగుట్॥ (శా) గంగాతీరములందు సై
కతపరిషాకరస్థలస్థాయియై। గాంగేయాద్రిధనుర్ధరుట్ ఫణిపతిగ్రై
వేయసౌగంధిక। త్వంగద్బిల్వపయోరుహంబుల మదిట్ దాత్పర్యభక్తిక్రి
యా।సాంగత్యంబున గొల్చు పుణ్యులు గదా సౌభాగ్యభాగ్యోదయుల్॥
(శా) సాహంకారవిహారనీరపటునాట్యారంభసంరంభముల్ । మో
హాధ్వాంతవిఘాతసంయమిజనాహ్లాదస్తుతిధ్యానమ । త్యూహాపోహా
పురాణశాస్త్రప్రవరనోద్యుక్తప్రతీరంబులట్ । వాహుళ్యంబుగ నీకెయొ
ప్పును గదా పాతాళగంగానదీ ॥ (వ) అని స్తుతింపుచున్న సనత్కు
మారుం జూచి వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టిదనిన న
మ్మునీంద్రుం డిట్టు లనియె॥ (క) పాదపకాష్ఠజ్యోతి। ర్వాదవయ స్తం
భవశ్యవజ్రిశరీర। ప్రాదుర్భామౌషధసం । వాదనములు చంద్రగుప్త
వనపర్వతముల్॥ (క) తొమ్మిది కదళీవనములు । దొమ్మిది పరభూ
రుహములుఁ దొమ్మిది బిలముల్।దొమ్మిది యమృతపు బావులుఁ।దొమ్మం
డ్రిపురాధిపతులు దొబ్బరలయుక్తుల్॥ (క) మదలీలాశుకకోకిల। పద
లీన్యూహపాదపస్తబకశిఖా।సదశీరవగానాంచిత । కదళీవనశోభితము
లు కడు నద్భుతముల్ ॥ (శా) ధూమాంభోసిలభుగ్భుజంగము మ
వాంభోజాతమాతంగముట్ । ధీమద్యోగిమనోనిషంగము మరుద్దివ్యాస్త్ర
మోత్సంగముట్ । సామర్థ్యోన్నతిదిక్కుడుంగము మునిస్వాంతాబ్జ
సంసంగముట్ । శ్రీమత్పర్వతశృంగముట్ బరిచితశ్రేయోంగనాసంగ

ముల్॥ (క) అటఁ జని శిఖరముఁ జూచిన।నటఁ జూడఁడు నరుఁడు నిర్భ రాటోపకళా। కుటిలయమరాడ్భయంకర।చటులభ్రుకుటీకృతోగ్రస మరముఖంబుల్॥ (గీ) ఇట్లు శిఖరంబుఁ గనిశిఖరేశలింగ। దర్శనంబు నసకలపాతకము లెల్లఁ।బాయుశుభములు పొందునొప్పంచజనున। కేమి తక్కె వర్ణింపసౌఖ్యము లు గలుఁగు॥ (క) ధరణి నుత్తరద్వారతీర్థము లలోనఁ।బుణ్యతమము లు సర్వేశపుష్కరంబు।లనెడి నదములుపావనా యతమహాత్వ।మహిమవర్ణించ నరిది పద్మజునకైన॥ (శా) శ్రీపంచా ననభక్తసంఘ మెపుడుల్ సేవింపఁగా భూమిభృ। చ్ఛాపశ్రీకరనామశ క్తివెలయల్ సర్వేశతీర్థంబునన్। బాపాస్పదులుఁ గ్రుంకిరేని యొ డలన్ బంకంబు సంధించు॥ స్వాపద్రోణులు గ్రుంకనీఫలశుభప్రాప్తియం

—(*) సర్వేశపుష్కరనదులమహిమ. (*)—

బు తోయంబగున్॥ (క) దుర్వారదుష్టదుష్కృత। దుర్ఘటగర్వాప హారణలోయమహాత్మా। ఖర ప్రవాహాశక్తిని। సర్వేశ్వరతీర్థమున కు సరియే నదముల్॥ (మ) మనుజశ్రేణులు దానమాడను శిలామధ్యం బుపై నిల్చినన్। ఘనదుష్కర్ములైనఁ జైఁబడకఁ దద్గాత్రిపాప కంఠరంబులన్। జన లంఘించితొలంగు పుణ్యులపయిన్ సంధిల్ల వర్షించు న। ద్దినకృత్యంబు పవిత్రపుష్కరమహాతీర్థాంబుధారావళుల్॥ (ఉ) నిష్కపటప్రవృద్ధజననిర్మలచిత్తవికాసభావనా। విష్కృతతీర్థ సారకు నవీనపవిత్రమహాత్మ్యపూరకున్।దుష్కృతకర్మదుర్భవవిధూ తవిచారకుఁ బుణ్యసారకున్।పుష్కరతీర్థసారకుఁ బ్రభూతవిహారకుసా టియేనదుల్॥ (క) ఘోరాఘధారుణీధర।ధారాధరదాహశస్త్రధా రౌఘరసా।ధారణమహిమోజ్వలజల। ధారన్ బుష్కరమహానదము పెంపొందున్॥ (వ) ఈతీర్థద్వయంబును మనుష్యుల పుణ్యపాపంబు లేర్పఱచి తత్క్షణంబ శుద్ధాత్ములం జేయు నెండియు॥ (క) లాలసదు గ్గాభైరవ।జాలప్రఖ్యాతతీర్థసారము ముక్తి। శ్రీలలనాముఖముకు

రము: ఏలేశ్వర మఖిలలోక వందిత మనఘా॥ క॥ తొమ్మిది దుర్గాలు న
రుచును। దొమ్మిది నరసింహములును దొమ్మిది గిరులుం । దొమ్మండ్రు
భైరవులు నరి॥ తొమ్మిది లింగస్థలములు దుష్కృతహరముల్॥ ఉ॥ పంక
జగర్భ విష్ణుబలభిండనవాఖ్యపదంబులుం నిరా।తంకసమస్తభోగములు
దారనొసంగు మనుష్యకోటికిం । శంకరుగిర్యమందిరము సర్వమనోహ
రసౌఖ్యదంబు హా। లంకను సాటి విశ్వవిపులస్థితి నెన్నంగ నెవ్వ దీర్ఘ
ముల్॥ క॥ శివ చిర కామితఫల। జాలము లనిశంబుం బంచజలకు నొ
సంగ। జాలిన వృద్ధస్థల మగు। పాలంకకు సరివొ యితరభవ్యస్థలముల్॥
(క) అహా మహామికోర్వత। సహితశివప్రమథదివిజసంయమిపరుషద్బ
హ పుణ్యాకరము ధరణీ। మహిళా మండలము నందిమండల మనఘా॥ (క)
నవనందిమండలంబులు। నవకుండికతీర్థపావనస్థానంబుల్। నవనందికే
శ్వరులు నభినవభక్తులు ముక్తులిడు సనాతనమూర్తుల్॥ (వచనము)
నందికేశ్వరుండు తపంబు చేయు మహాత్మ్యంబున నందిమండలంబు నామం
బమ్యనకూడ వర్ణించు సమస్తజంతువులకును నపవర్గసౌఖ్యంబులు
గలుగు నానందిస్థలంబులును దత్తీర్థంబులు దర్శించిన మానవులకుం గా
మితార్థంబులును భోగమోక్షంబులుం గలుగు వెండియు॥ (ఉ) శ్రీనగ
కంధరంబుల వసించి చరించు పుళిందబృందముల్। భూనుతభోగమోక్ష
ములం బొందగం జూచి నిలింపసంఘముల్। శ్రీనిలయాభిరామ మగు శ్రీ
గిరి మీదం జనింతు రట్టుల। మ్మానితనాకసౌఖ్యమహిమంబుల నెల్లం
దృణీకరింపుచుం॥ (మ) కలనారంభమనోరథాంబువులు రాగద్వేషఫేనం
బులుం । మలమాయామయజంతుసంఘములుం గామక్రోధకల్లోలము
ల్। కలుషావర్తము లంగభోగతటముల్ కల్పించు జన్మాంబుధిం। జలబిం
దుక్రియ దాటు మానవుడు శ్రీశైలస్థలస్థాయియై॥ (సీ) ఎందఱికైనను
నిచ్చుమహాఫలం బొల్పం దరుణేందుకళ లెన్ని దాచినాండొ। యెందఱి
కైనను నిచ్చు నెవ్వడు కోడెలాలకోడియ లెన్ని వేలు గలవొ। యెం
దఱికైనను నిచ్చు హాలాహలకస్వంబు లవి యెన్ని గలవొ కాని। యెం

దటికైనను నిచ్చు భూషణములు కాకోదరము లెన్ని గలవో కాని। శ్రీ
నగంబున సజ్జనశ్రేణి మీఁద।వాంఛ యెట్టిదో తాన పవర్గ మొసఁగు।
నాశ్రితానుభూరుహం బగునో కాదో।విశ్వనాథుండు శ్రీపర్వతేశ్వ
రుండు॥(చ)మశకపిపీలికాశలభషట్పదకోటిపరాజి శ్రీగిరిన్। విశసన
మొందు మీఁద సతవిశ్వరుద్రముఖసురస్తుతా। కుశరుహరాగరత్న
రుచికుంభిత మౌళివిరాజితాంగులై। శశిధరపార్శ్వభాగపరిషత్ప్రమ
థాధిపు లౌదు రున్నతిన్॥
(క)కరి కరిచర్మము గట్టును। హరిణియు హరిణంబుఁ బట్టు నహి యహి
హిఁ దాల్చున్। ధరియించు శశిని శశకము సిరిగిరిఁ గలజంతుమహిమఁ
చిత్రము గాదే॥(క)మంచిది మహేంద్రకీలము। పంచాస్యుల్ జంపుఁ జే
సెఁ బర్వతమని దాఁ।జంచులఁ బరిచాస్యులఁ గా।వించున్ విన నొందు
నిట్టి విస్మయమహిమల్॥(క)చెంగటి గడ్డకు బావియు।ముంగలి పాతాళ
గంగ ముక్తివధూటీ। సంగము శిఖరేశ్వరమును।సంగతి గల శ్రీనగంబు
సరియే నగముల్॥(క)లక్షకుఁ గేదారంబును।లక్షద్వయమునకుఁ గాశిలా
గున గయలో।లక్షకు నేడింటికి మఱి। భిక్షము శ్రీశైలమునను బెట్టిన ఫల
ముల్॥(క)మనుజుఁడు శ్రీగిరిఁ బుణ్యము। గొనకొని చేసినను గోటి గుణి
తంబగు న।మ్మనుజుఁడు శ్రీగిరిఁ బాపము గొనకొని చేసినను గోటిగుణి
తంబు లగున్॥ (సీ)ఏదేవునకు శిఖరేశ్వరంబ శాంతిలాలితక్రీడాచలస్థ
లంబు। రేవనే వేల్పు క్రీడించుఁ గేళాకూళితరళతరంగపాతాళగంగ।
యేదేవునకుఁ గూర్మి హేళాకళావతిభ్రమరాంబ భవ్యప్రభాకరం
బు।భైరవాదిక్షేత్రపాలకప్రవరులు ప్రహరిఁ జరింతురే భవ్యమూర్తి।
నట్టి శ్రీమన్మహాదేవు నసుఁగు పురము।గూఢసంజీవనీవని కుంజపుంజ। మ
ధిలోన్నిద్రకల్పద్రువాపికూప। భమణహర్మ్యోన్నతంబు శ్రీపర్వతం
బు ॥ క ॥ దానములు కిన్నిఁద్రా। గానముల సమస్తపాతకప్రచ
యములన్। లూనముగఁ జేయు ముక్తివి। ధానములం జెలఁగు
బర్వతస్థానంబుల్ ॥ శా॥ధాత్రిన్ గంది రహఃప్రదేశముల నప్పాతా

శగంగానదీ। స్రోతస్స్నానపరాయణవ్రతమృగీ పక్షీంద్రవృక్షాచల। వ్రాతశ్రీకరశోభనాద్భుతపరిప్రాప్తేహపుణ్యస్థలీ। పూతంబై విలసిల్లు శ్రీనగముపైఁ బుణ్యాశ్రమశ్రేణికల్॥ (శా) రమ్యస్ఫూర్తిఁ వహించు శ్రీగిరి పవిత్రక్షేత్రధూళిచ్ఛటల్। కామ్యార్థంబులనిచ్చు దోషలతలన్ ఖండించు లీలాగతిన్। సోమ్యాటోపనటన్మహానటజటాజూటాటవీకోటర। భ్రామ్యత్సింధుపయోజవాఃసుపటలీపాటచ్చరప్రక్రియల్॥ (మ) క్రముకాక్షీస్మితదానలోలము మహాకల్యాణసంశీలముల్। భ్రమదానందకుజాలవాలము ముసిప్రస్యంతకృత్తీలముల్। శమినాంచోద్భవజాలముల్ సుఖకరస్వచ్ఛంద్రనిశ్రేయసప్రమదాఖేలముము క్తిమూలము మరుత్పాలంబ శ్రీశైలముల్॥ (క) శ్రీశైలము శ్రీశైలము। శ్రీశైలంబనెడు పుణ్యశీలుని మదిలోనాశైలజాధినాథుఁడు। శ్రీశైలనివాసుఁ డుండుఁజే

—— శ్రీగి చతుర్ద్వారనిర్ణయము-అందలి జీవతాతీర్థములమహిమము. ——

తః పిరిన్॥ (క) రాజిత పావనతీర్థసమాజప్రఖ్యాతజనిత మాహేశ్వరమా। రాజధరునకును శ్రీనగరాజాధీశునకును త్తరద్వార మగున్॥ (క) యోగములు భక్తిరససంభోగములుఁ బురాణశాస్త్ర పుణ్యశ్రవణో। ద్యోగదుల జనులకును నను। రాగములన్ జెలఁగు నుత్తరస్థానంబుల్॥ (వ) అందులతీర్థంబులు మాహేశ్వరలింగస్థలంబులును ఉమాదేవియును శక్తియు రుద్రధారయుఁ బంచధారయు నక్షీణధారయు దేవధారయుఁ బల్లవధారయు విష్ణుధారయు భైరవధారయు నింద్రధారయు మాహేశ్వరంబును నీలేశ్వరంబును నవభైరవులు నవదుర్గాస్థానంబులునవ నారసింహస్థలంబులు జంబుకేశ్వరంబును సంధ్యాతీర్థంబును గరుడేశ్వరంబును గణేశ్వరంబును సమాధితీర్థంబును కాలహ్రదతీర్థంబును దేవహ్రదంబును నీలహ్రదంబును నగ్నీశ్వరంబును గన్యాతీర్థంబునునమరేశ్వరంబును నమరావతీతీర్థంబును యమునేశ్వరంబును జటాముఖనందీశ్వరంబును తీర్థంబును గోకర్ణమహేశ్వరంబును పాపవినాశంబు

ను నుమ. శైల-బును సూర్యేశ్వరంబును భీమేశ్వరంబును దిలపిష్టేశ్వరం బును హేమశైలంబును రుద్రకోటీశ్వరంబును మొదలైనపుణ్యతీర్థంబు లనంతంబులు గలవు తత్తీర్థంబుల నవగాహంబుచేసి యాయాతీర్థం బుల శివలింగదర్శనంబుసేయు మానవులకు నశ్వమేధసహస్రంబునువా జిపేయశతంబునుం జేయునట్టి ఫలంబుసిద్ధించు నెండియు॥ (క) వందా రుదేవతాముని।సందోహము లబ్బురంబు శాశ్వతసదనం। బిందుధరునకు ను శ్రీనగ। మందిరనిలయునకుఁ బశ్చిమద్వారమగున్॥ (క) బ్రహ్మేశ్వ రలింగంబును। జిహ్మగభూషణుని భక్తిసేవింపఁబర।బ్రహ్మజ్ఞానము గలు గును। బ్రహ్మస్త్రీగోవధాదిపాపము లణఁగున్॥ (వ) అందుల తీర్థం బులు తుంగభద్రాతీర్థంబును యోగితీర్థంబును వేదవతీతీర్థంబునునా దవతియు మణికర్ణికేశ్వరంబును రామేశ్వరంబును నమరేశ్వరంబును యమునేశ్వరంబును గణేశ్వరంబును ముక్తిరామేశ్వరంబును భోగీశ్వరం బును వరుణేశ్వరంబును లక్ష్మణేశ్వరంబును నైత్తడిరామేశ్వరంబును మణి భద్రేశ్వరంబును సప్తమునీశ్వరంబును గుప్తమాహేశ్వరంబును గుప్తమ ల్లికార్జునంబును నింద్రేశ్వరంబును సిద్ధేశ్వరంబును మొదలైన పుణ్యతీ ర్థంబుల నవగాహంబుఁజేసి యాయాయితీర్థంబుల శివలింగదర్శనం బుఁజేయుమానవులకు నశ్వమేధసహస్రంబును వాజపేయశతంబును జే యుఫలంబు సిద్ధించు నెండియు॥ (క) తోయజభవసురపతినా।రాయణ ముఖదేవతాభిరతి సిద్ధవటం। బాయతమహిమము శ్రీగిరి। నాయకపు రమునకు దక్షిణద్వారమగున్॥ క॥ సిద్ధవటేశ్వరుఁ గామిత। సిద్ధిప్రదు దర్శనంబుఁ జేసినముక్తుల్। సిద్ధించుఁగ్రీడసల్పును। సిద్ధామరకిన్నరేంద్ర సేవాన్వితుఁడై॥ వ ॥ అందులతీర్థంబులు సిద్ధేశ్వరంబును నష్టమహాసి ద్ధియును శక్తియు జ్యోతియు నిష్టకామేశ్వరంబును భృగుపాద తీర్థం బును వరుణేశ్వరంబును బుష్పగిరియును గుముద్వతీతీర్థంబును గన్యాతీ ర్థంబును రామేశ్వరంబును ధర్మకూలోత్తరంబను నదియును బ్రా ణేశ్వరంబును మోక్షేశ్వరంబును గపిలేశ్వరంబును సాలంకయు మత్స్య

లంకయు నందిమండలతీర్థంబులు బ్రమథనందియు నాగనందియు శివనందియు కృష్ణనందియు మహానందియు గరుడనందియు నాగకనందియు దివాకరనందియు సోమనందియు బ్రహ్మనందియు నోంకారేశ్వరంబును నహోబిలంబును శంకరేశ్వరంబును బాపవినాశనంబును దూర్వాసుతీర్థంబును రుద్రకోటితీర్థంబును మొదలైన పుణ్యతీర్థంబుల నంతంబులుగలవు తత్తీర్థంబులనవగాహంబుఁ జేసి యాయాయితీర్థంబుల శివలింగదర్శనంబుఁ జేయు మానవులకు నశ్వమేధసహస్రంబును వాజిపేయశతంబునుం జేయుఫలంబుగలుగు నెండియు॥ క॥ స్వారాజదివిజసేవ్యము। పారావారాంతభూమిపావనభూభృత్సారము శ్రీగిరిపూర్వ। ద్వారము త్రిపురాంతకంబు వశమె నుతింపన్॥ క॥ త్రిపురాంతకు దర్శించిన।నపరిమితాశేషపాతకాదులు వొలఁగున్। విపులశోభంబులు పొందును।నపవర్గసుఖానురాగ మప్పుడె కలుగున్॥ వచనము॥ మలతీర్థంబును గంధవతి యను త్రిపురాదేవియును శక్తియు ధూర్జటీశ్వరంబును బృథుశైలంబునును త్రిరేశ్వరంబును గన్యాసిద్ధేశ్వరంబును గౌరీశ్వరంబును సప్తకోటీశ్వరంబును మండూకేశ్వరంబును గుండప్రభాతీర్థంబును సహస్రరామేశ్వరంబును లింగతీర్థంబును సంగమేశ్వరంబును గపిలేశ్వరంబును సకలాంగసోమేశ్వరంబును బరశురామేశ్వరంబును భీమేశ్వరంబును మణికర్ణికేశ్వరంబును ముక్తీశ్వరంబును దులాసిద్ధేశ్వరంబును శ్రీకర్ణేశ్వరంబును రుద్రాక్షశైలంబును విభూతినగరంబును ధర్మేశ్వరంబును పునర్వేశ్వరంబును గంధర్వతీర్థంబును మోక్షకుండంబును మొదలైన పుణ్యతీర్థంబు లనంతంబులు గలవు తత్తీర్థంబులన్ గృతస్నానులై యాయాయితీర్థంబుల శివలింగదర్శనంబులు చేయు మానవులకు నశ్వమేధసహస్రంబులు వాజిపేయశతంబులు చేసిన ఫలంబులు సిద్ధించు నెండియు న్గల వనిన వేదవ్యాసుండు తరువాతి కథావిధానం బెట్టిదనిన నమ్మునీశ్వరునకు సనత్కుమారుం డిట్లనియె॥

ఆశ్వాసాంతము.

క॥ కాంచనగర్భామరవర। కాంచనకోటీరమణిఘర్షితపదా।

పంచాక్షరఫలకల్పకా। పంచాస్త్రతమఃపతంగ పర్వతలింగా॥ మాలిని॥ దివిజరిపువిపక్షా దేవతానీకపక్షా। వివిధఫలదవీక్షా విశ్వరక్షైకదక్షా। భవదురితవిభంగా భక్తచిత్తాబ్జభృంగా । భువననిధిరథంగా భూధరాధీశలింగా॥ శా॥ అభ్రద్వీపవతీమహాలహరిసవ్యాగ్రోతవిద్యుత్ప్రభా । బిభ్రద్బభ్రుజటాటవీకుటజలంబిస్థూలరేఖాశిఖా । సిభ్రాదభ్రసితాభ్రవర్ణసుమనస్స్నిగ్ధేందురేఖాధరా। మభ్రత్సర్వజగత్పవిత్రకరనామా పర్వతాధీశ్వరా॥

గద్యము॥ ఇది శ్రీమల్లికార్జున కృపాలబ్ధమేదురాష్టభాషావిశిష్టశివయోగగణవర్య శేషనాధార్య ప్రణీతంబైన శ్రీ పర్వతపురాణంబు నందు

దృతీయాశ్వాసము.

శ్రీసాంబసదాశివార్పణమస్తు.

---





శ్రీ రస్తు.

శ్రీభ్రమరాంబాసమేత మల్లికార్జునస్వామినేనమః.

శ్రీపర్వతపురాణము - చతుర్థాశ్వాసము.

(క) శ్రీశైలపుణ్యమహిమము। లాశైవతనూజవినుచు నానందసు
ధా। రాశిరసకేళిఁ దేలుచు।నీశానునిఁజూచి త్రిభువనేశ్వరి పల్కెన్॥(గీ)
విశ్వలోకేశయిఁకనొకర్థ విన్నపంబు। మల్లికార్జుననామమే మహిమఁగ
లిగె. తెలియనానతిఁ గృపసేయు దేవదేవ॥ (వ) అనిన పరమేశ్వరుండి
ట్లులనియె సతికి॥ (సీ) శ్రీపర్వతంబు వర్ణింపఁగాఁదగు ధరాజలజాక్షి
కర్ణభూషణము వోలెఁ। గవిరాజదినకరకమలాసతీశ్వరధామమై మే
రుభూధరము వోలె। వివిధగంధర్వాదివిద్యాధరానీకసదనమై దేవతా
స్థలము వోలెఁ।గుందనీలాబ్జను కుందసందోహంబు పొందును ధననాథు
పురము వోలె। ధర్మ్యహర్మ్యాగ్రభవనవిభ్రాజమాన। ఖచితమాణి
క్య పంకసంగతవిటంక। దేవతాగారమంటపోదీప్తశాత।కుంభకుంభాన్వి
తము చంద్రగుప్తపురము॥ (సీ) కలుగవాజనులందుఁ గారిన్యగుణములు
ముదితల వక్షోజములనె కాని। వక్రగుణంబులెవ్వారియందును లేవు కుటి
లాళివేణుల కురులఁ గాని।చంచలత్వంబు లేజనులయందును లేవు పుష్పకోమ
లులచూపులనె కాని।జాడ్యంబులప్పురి జనులయందున లేవు నారీమణులగ
మనముల గాని। వేములప్పుజనులందు లేవు బెరసి।అలరుబోణుల చారు
మధ్యములఁ గాని।యిట్టికల్యాణపదములకాలయంబు। పుడమి నీచంద్రగు
ప్తికేపురము సాటి॥ (క) పురినేలు ముక్తిభూమికి। సరియన నిర్జరు
లునంద జనియింతురుని। భరరభోగమోక్షములకై।చర జంతువులెల్ల
పొందుజన్మము లనఘా॥ అప్పుర్యాధీశ్వరుండు॥ (సీ) చేయించె నెవ్వాఁ
డు సేవితోర్వీశులరాజ్యంబు లక్ష్మీవిరాజితముగ।త్రేయించె నెవ్వాఁడుర్వ
దసర్వదిగ్గజస్తంభంబులను జయశాసనములు। మాయించె నెవ్వాఁడు

మార్తాండవిక్రమోద్ధతిజనాకించనధ్వాంతములను। కాయించె నెవ్వ
డుతఁటకీఁడ చెంద్రికల్ చక్రవాళాంతఘూచక్రిమునను।నతఁడు జలరా
శిపరివేష్టితావనీశ। రాజరాజీవషండమార్తాండమూర్తి। చంద్రచం
ద్రికపాంమృతచారుకీర్తి। గుప్తవంశోద్భవుఁడుచంద్రగుప్తనృపతి॥ (క)
ఆచంద్రగుప్తకూఁడురు। ఆన ప్రతీవఘూటి యనిశముమదిలో।నాచం
ద్రిమఃఖులు దానును।నాచంద్రకిరీటు గొలుచు నచలితభక్తిన్॥ (క) వి
ద్యుతాఁంతుల డాలును।ఖద్యోతప్రభలుగూర్చి కనకపునీటన్।హృద్యం
బుగములు గడసును జోద్యంబుగఁ జేసె నబ్జసూనుండింలిన్॥ (క) పల
రాజు రాణివాసము।తపరాకున్ బోణిచకఁదనమును నొఁ అవున్। గిలు
మాడి యొప్పులన్నియు। నిఁపి ప్రయత్నమున నజుఁడు నెలతుకఁజేసెన్॥
(క) చెలివాలను పలుపు మాటలు।పలుకద్రు మగమీలుకనఁగవకు సరియు
గునే।పులికుట్టు మాటలేటికి। కలకంఠి కుచోపమములె కనకఘటంబుల్॥
(సీ) ఘనకాంతిమెలఁగెడు కనకంపుఁదీఁగెయో కాదుకంతుని భద్రగజ
ముగాని।కాంతరయో కస్తూరిగా పస్యరూపమో కాదుసజర కంబుకంఠి
గాని। రాజాస్యరూపమో రత్నప్రదీపమో కాదు కాముని దేహకాం
తిగాని।చిరుసాన బట్టిన చిత్రజబాణమో బాణమె మన్మథత్రాణగాక।
కలరెసీరితి మానవాంగనలు ధరణి ననుచుం బువుబోణులెల్లను నభినుతిం
పఁ। గంధసామ్రాజ్యపట్టంబు గట్టఁదగిన।రమణివిలసిల్లె విభ్రమారంభ
ములను॥ (క) ఆలిచంద్రాబ్జంబుల మును। నిలిపినచే వణఁకుదీటి నేర్చిన
వాఁడై। యలసూనవిల్తు వింటికె।నలవరిచెన్ గమలసూతి యటుగా నో
పున్॥ (వ) అనినుతియింపుచు సఖీజనులు సరసాలాపంబులన్ గొలువ
నొకఁనాఁడు॥ (గీ) పడఁతినానారసప్రాయభంగులందుఁ। ప్రౌఢరీ
తుల గీతముల్ వాడనృపతి।చూచెనంగభవుండు ప్రసూనశరము। వాఁడి
శావించిఁగుతించి వంకదీచెన్॥ (క) మోహించి నజనకవ్యా।మోహం
బుడిదురితకమణమూలంబని త్రా।సూహించి మగుకితనగృహ। దేహాళి జే
తుజ్ఞుననిలిచె తెలివలు దానున్॥ (వ) అకఁడ సఖీజనంబులం జూచి చం

చంద్రవతీకన్యయిట్లనియె॥ (క) మదనుండు పాపకర్ముఁడు।మొదలన దర్ప కుఁడు గానమూఢుఁడు గాఁడే।మదనారిని డెందంబున।పదిలంబుగ నిలిపి తండ్రీగసాధించితిఁ॥(క)నిగనిగమెఱల వేఁడిమి। జగిదాలకెడుతనమువె ల్లచిచ్చెరకంటన్।జిగురున్ గ్రైదువజోడును। డెగఁజూచినధీరు దేవదేవున్ గొలుతున్॥(వ)అనినసఖీజనులిట్లనిరి॥(క)సరియట్టకానచిత్తము।సరిలికిదె గగూడదెల్ల సంయమికైనన్ వరరాజ్యభోగసంగతి।మరగనచిత్తంబుశివు నిమరుగఁగవశమె॥(క)ఇట్టిసదాచారిత్వము।నిట్టిదృఢవ్రతముఁగలదెయిత రులకెల్లన్।గట్టిగశివుకృపగలిగిన। నెట్టనశరణులకుఁగాకనిఋకడగలదే॥ (క)పలుకులుశివమంత్రంబులు।తలఁపులు శివభక్తితత్త్వతత్పరలీలల్।నిలుక డ సన్మార్గము ఈ। చెలువకుహృదయాంబుజంబు శివనిలయ మగున్॥ (క) పసిఁడికిఁగమ్మని వాసన। ప్రసవము మలయజము నకును ఫలమిత్తు నకున్।ప్రసవించినచందంబున వసుమతి జనియించి తమ్మినజదళాక్షీ॥ (క) గౌరీవల్లభువలనన్। గారుణ్యమువడయు కంబుకంధరియనుచున్। నీరేజముఖులు దీవెన। లారాజతనూజ కొసఁగిరధికప్రీతిన్॥ (గీ) సఖు లు బోధించి తెలుప నిశ్చలవిరక్తి।శివుని డెందంబునత్తన్మిసీమనిల్పి।కాం తలును గీతిఁ సేయ నేకాంతమునను। పద్మలోచన యిట్లని స్తుతించె॥

(రగడ.)

శ్రీమత్పర్వతశిఖరవిశాలస్థిరపీఠము పర్వతలింగము । సామఋగ్య

—(*) చంద్రవతి పర్వతేశ్వరుం బ్రస్తుతించుట. (*)—

జుర్మునిఖిలశ్రుతిసన్నుతపాదము పర్వతలింగము । హైమవతీముఖ చంద్రచంద్రికాహ్లాదచకోరము పర్వతలింగము ।సామజదానవచర్మప టీప్రశాలకపీఠము పర్వతలింగము । రమణీయత్రిదశాళయాశ్రితజనరత్న సాను వీపర్వతలింగము । కమనీయాశ్రితవిశ్రాణనగుణ కామధేను వీప ర్వతలింగము।షడ్విధభక్తిస్థలసంపూజితసత్శ్లోకము పర్వతలింగము। షడ్విధపత్త్రాంచితమంత్రాంబుజచంచరీక మీపర్వతలింగము । అశ్రాం

తాశ్రితసంరక్షణసంయుతచింతామణి పర్వతలింగము। నిశ్శ్రేయసప్రదాని
రతమునిశ్రేణీరక్షామణి పర్వతలింగము। కామితఫలప్రతిపాదనక
ల్పవృక్షమీపర్వతలింగము। వామదేవమునిముఖ్యావర్ణిత వరదకటా
క్షము పర్వతలింగము। స్వర్గనదీజలసంక్షాళితపల్లవసన్నిభజూట
ము పర్వతలింగము। వర్ణితమధురసుధాకరరేఖావహనకిరీటము ప
ర్వతలింగము। బ్రహ్మమునీశప్రచురభవాబ్ధిప్రకటితహేతువు పర్వత
లింగము। బ్రహ్మాండకరప్రభవాసవభంజనహేతువు పర్వతలింగము।
పంకరుహప్రభవాండమాలికాభరణోపేతము పర్వతలింగము। పంక
జాక్షనందనపారాశరప్రకరఖ్యాతము పర్వతలింగము। దారుణభూ
రిభవాబ్ధిమగ్నసంతరణవహిత్రము పర్వతలింగము। పరవిశ్రుతత్రిపుర
పురత్రయభీతిహారి మీపర్వతలింగము। భ్రమరాంకేరుహదళనే
త్రీపాణిగ్రహణము పర్వతలింగము। సమధికనిఖిలకలంక తపోధనసద
నుగ్రహణము పర్వతలింగము। బ్రహ్మేంద్రాదిత్రిదివౌకఃపరిపాలన
దక్షము పర్వతలింగము। జిహ్మగపరివృఢదివ్యవిభూషణశ్రీకరవక్షము
పర్వతలింగము। సేవాగతసురమస్తకమణిస్పృష్టి దీపకము పర్వతలిం
గము। భావుకచిత్ప్రద్యోతమానసుఖపరమరూపకము పర్వతలింగ
ము। నిఖిలశ్రుతిశాఖాశిఖరనిత్యశ్లాఘము పర్వతలింగము। అఖి
లమహాపాతకసముదయపరిహరణగుణౌఘము పర్వతలింగము। అన
వరతానందామిత పరమాత్మాభిధానకము పర్వతలింగము। అనుప
మనిత్యసుఖాపవర్గఫలదావధానకము పర్వతలింగము। సర్వజగ
న్నుతకైవల్యవ్రతజనతారాధ్యము పర్వతలింగము। నిర్వచనీయవిశా
లభక్తవరనిజసాన్నిధ్యము పర్వతలింగము। నతశతమఖముఖవిబుధకృ
పాంబుధినామధేయము మీపర్వతలింగము। ప్రతిభాసితముముక్షుజనశ్రిత
భాగధేయకము పర్వతలింగము। ప్రస్తుతనిశ్చలభక్తపురాతనపక్షభరా
ధరము పర్వతలింగము। శస్త్రవితతత్పరజనకమలాజలపయోధరము
పర్వతలింగము। శివవశవర్తననిపుణమారాధనచిత్తశోధకము పర్వతలిం

గము । ప్రవిమలధర్మజ్ఞానపరాయణభక్తిబోధకము పర్వతలింగము ॥ ముఖ్యాచతుర్దశభువననికేతనమూలస్తంభము పర్వతలింగము । విఖ్యాతస్నానకజనపూజావిభవవిస్రంభము పర్వతలింగము । రంజితభక్తజనానురాగనవరసవికస్వరము పర్వతలింగము । భ్రాజితపరమబ్రహ్మవిగ్రహవిభావభాస్వరము పర్వతలింగము। శిష్టాచారవిచారవివేకవిశేషనిర్భరము పర్వతలింగము । దుష్టేంద్రియసంచారప్రకటితదురితదుర్భరము పర్వతలింగము । అసదృశకీర్తిసితాభ్రపూరితాజాండకరండము పర్వతలింగము । అసమశరాసనగర్వతిమిరసంహతిమార్తాండము పర్వతలింగము । దండధరాఖండితపిచండకరదండఖండనము పర్వతలింగము। చండకిరణమండలకాండాయుతసదృశమండలము పర్వతలింగము । నిజదేహాంబుధిసంజనితనిఖిలజగన్నిచయతురంగము పర్వతలింగము। భజనపరాయణసన్మునిచేతఃపంకజభృంగము పర్వతలింగము । మహితత్రిభువనమంకితచతురామ్నాయతురంగము పర్వతలింగము । బహుళవిక్రమక్రమవిశ్రుతకరపద్మకురంగము పర్వతలింగము । సర్వలోకహితకారణభాసురచంద్రధాంగము పర్వతలింగము । అర్వాచీనపదోదంచితనిత్యానకదాంగము పర్వతలింగము । గమ్యమానశివభక్తియోగరతకరుణాపాంగము పర్వతలింగము । రమ్యాశంసితరూపవిలాసకురంగసురాంగము పర్వతలింగము । వేదాంతోపనిషన్మృదుభాషణవినుతభుజంగము పర్వతలింగము । మేదురబలగజదానవకంజామితమాతంగము పర్వతలింగము । వినుతసురాంభోరుహాసరిభవదవీకరతల్పము పర్వతలింగము। అనుపమపర్వతపుత్రీకుచపత్రిశిల్పకము పర్వతలింగము। సామప్రముఖశ్రుతిచరణోన్నతసరసప్రౌఢము పర్వతలింగము । కామికముఖ్యాఖిలదివ్యాగమకథనవ్యూఢము పర్వతలింగము। సజ్జనరక్షణసంప్రీతికోదనసదనుగ్రహణము పర్వతలింగము। గర్వదుగ్రనిఘృణకంఠీరవకటునిగ్రహణము పర్వతలింగము। పరతటీప్రధారాజలశాంతవిపత్పరాగము పర్వతలింగము । నిరుపమజహాద

జపాల్లక్షణగుణానిపుణరాగము పర్వతలింగము । ఏకాదశమంత్రాదిప
ల్లవదక్షైకశరణ్యము పర్వతలింగము । ఏకాశీతిపదాతీతబ్రహ్మైకశ
రణ్యము పర్వతలింగము। సంచితపంచశబ్దాంచస్వరసారస్తుత్యము-ప
ర్వతలింగము। పంచప్రణవస్ఫుటబీజాక్షరభజనౌచిత్యము పర్వతలింగ
ము। శబరబిల్వపత్రారాధనమోక్షప్రదాయకము పర్వతలింగము। ప్ర
బలకక్షత్రియపాశపంచపరిపాలనాయకము పర్వతలింగము। జూటస్థి
తసుమనస్తటినీశుభశుభ్రరాజితము పర్వతలింగము । కైటభదనుజప్ర
తిభటహాటకగర్భపూజితము పర్వతలింగము। భూరిభూతివిస్ఫురితశు
భప్రదభువనపావనము పర్వతలింగము । పారిజాతవిఖ్యాతాశ్రితభజ
నభవ్యజీవనము పర్వతలింగము । సేవితమునిగీర్వాణశ్రేణీచిరకరుణాని
ధిపర్వతలింగము । భావితచేపికహాటకగర్భవిభాసితసేవధి పర్వతలిం
గము। స్వానుభావసాధనచతుష్టయస్వాంతనివాసము పర్వతలింగము।
ధ్యానధారణస్థిరమానసశుద్ధాంతవిలాసము పర్వతలింగము । శమద
మాదిషడ్విధసంపత్తివ్రజనపర్వతము పర్వతలింగము । భ్రమితమోహ
మాయామితపాశప్రబలబంధురము పర్వతలింగము । శిఖరముఁ జూచి
న నరులకు నధికశ్రేయము లొసఁగును పర్వతలింగము।శిఖరముఁ జూచి
న నతులితముక్తి శ్రీ లొనరించును పర్వతలింగము॥

క॥ శైలము నెక్కెడ నోపరు।హాలాహల మాన వెరు అవేల్పు లనే।
నేలాభజియించెద నన్నేలిన దేవుండు జగము వేలుచు నుండున్॥ అని
స్తుతియించి మఱియు నిట్లనియె॥(సీ)దర్పకు గెల్చినంతటి యోగివయ్యు
ను గిరిజాధినాథభోగియును నీవ।అసురులగెల్చి దివ్యాస్త్రపాణివి య
య్యు ధర్మంబు నడపెడు తపసి వీవ। భిక్షాటనక్రియాభిజ్ఞాని వయ్యును
పరమేశ భువనాధిపతివి నీవ। బ్రహ్మకపాలసంభరణుండ వయ్యును సే
వ్యుండ వగు సదాశివుండ వీవ।పావకేక్షణ ఫణిరాజఫాలచంద్ర। భసి
తమందాకినీనదీస్పదపవర్గ । యుతుండవయ్యును నపవర్గ మొసఁగు
నట్టి।వరమహాత్వంబు లభవ మెవ్వరికిఁ జెల్లు॥(సీ)వెన్నుఁడు వలచి మే

విశ్వేశ్వరుని పాదకమలంబు మీఁదను గన్నవై చెఁ।బద్మసంభవునం తె పరిభువు నేదేవుండు క్రతుక పాలపరీక్ష గొనియె।నించువిల్కాఁడు బిట్టే సినఁ. దెరలకే దేవుండు మధ్యమదృష్టిఁ జూచె।కలశాబ్ధి తోలువెన్న కడి భుజియించియే శంభుండు నిత్యుఁడై జగము నిలిపె। నట్టి శ్రీమన్మహాదేవుఁ డఖిలదివిజ।వంద్యుఁడును దేవతాచక్రవర్తియైన। చెల్లుబడి నిట్టి మహిమలు చెల్లుఁ గాక।వనజగర్భాదిసురల కెవ్వారికిఁ జెల్లు॥(శా) కర్ణాలంకృతకుండలీశ్వరవియద్గంగాతరంగావళీ । పూర్ణాభేందుకళాకలాప విలసత్కోటీరపాటీరవా । స్వర్ణాడంబరదివ్యదేహ యనినా వాక్కాయకర్మంబులన్। వర్ణింతున్ నుతియింతు నిన్ను శివ దేవా దైవచూడామణీ॥(గీ)ఇట్లు వినుతింప సర్వేశుఁ డింతి మదిని। నీలకుంతలి నేఁగరుణింతు ముక్తి బరిణమించితి నీదృఢభక్తి కనుచు।పలికె నల్లైన పద్మాక్షి ప్రమదమంది॥(గీ)దర్పకారాతి మది నిల్పి తలిరుబోణి।సుదతు లెల్లను గొలువ నచ్చోటు వాసి।శంభుపూజార్థమై పుష్పసమితిఁ గోయ।నతివ శృంగారపూఁదోట కరుగు నంత॥(గీ)మదను పంపునఁ జైత్రాగమం బెలర్ప।

—(*) చంద్రవతీకన్య పూఁదోఁట కరుగుట. (*)—

వాలసి వనపఙ్క్తి భామిని మెరలు వదలి।లీల రాలు కపోలవల్లి వితాన।రమణ దీపింపఁ దరుల కారాకు వెడలె॥(క)వనవిలుతు మచ్చికవు మన్ననచే సొంపారి పొదలి నవక మెలర్పన్।వనసిజు బెక్కైములోయన।ననిచెన్ వల్లరుల కొన్నవలు సొంపారన్ ॥ (చ) కలకలకంఠభాషలు వికస్వరమత్తగజేంద్రయానముల్ । కలితలతాతనూరమణ గాఢమధువ్రత

—(*) వసంతఋతువర్ణనము. (*)—

కుంతలంబులున్।విలసితచక్రవాకకుచవిభ్రమముల్ దళుకొత్తచైత్రునిన్। గలసెనుమాళతెయుండె నవకానన పఙ్క్తి విలాసినీగతిన్॥ (సీ) కామించి వనపఙ్క్తి కమలాక్షిపులకించి క్రొత్తహాసులుసాగు స్తరించి। బాలశు క్రొత్తపుబ్రహ్మబాహులకును శిక్షించి చదువురాఁజెప్పిచెప్పి। శోభితనవల

నిసామ్రాణి తేజులనఁగఁ। జెంగలింత్రుచుఁబలికె రాజీలుకగములు॥ (గీ) అంతశృంగారపురిఁదోఁట కరుగుదెంచి। వనముసొంపును సఖులజవ్వనముసొంపు।విశ్వ మొందంగవనకేళివిశ్రమించి। ప్రౌఢకామినులిట్లని పలి

(*)చంద్రవతీకన్యసఖులుండానును శివపూజార్థము పూలుగోయుట.(*)

కిరంత॥ (సీ) మాధవీనవపుష్పమంజరిచూచితే యభిరామనవకలహంసయాన। యభిరామనవకలహంసాళిఁజూచితే ఖేలాభినవరాజకీరవాణి।ఖేలాభినవరాజకీరాళిఁజూచితే నీలకంఠకలాపనిభశిరోజ। నీలకంఠకలాపనిచయంబుఁజూచితే కలమృదుస్వరకలకంఠనాద। కలమృదుస్వరకలకంఠంబుఁజూచితే నిబిడకోమలాళిసీలవేణి। నిబిడకోమలాళినికరంబుఁజూచితే యనుచుఁ గ్రీడసల్పి రతివలంత॥ (క) విమలోదకప్రపూరము। శమితేంద్రియసంయమీంద్ర జలతిమిరము నుద్గమపుణ్యాఫలదనీరము। కమలోత్పలపుష్పగంధికాసారంబున్॥ (గీ) చేరియందఱు నత్యంతచిత్తశుద్ధి। తత్పరత్వంబునను కృతస్నానులగుచు। శంభుపూజార్థమైపుష్పసమితిఁగోయ। నవసరంబున నొకతెయిట్లనుచుఁబలికె॥ (క) భూతేశుపూలఁబూన్పెదు। జాతులనఘములను నగ్రజాతిప్రముఖ।ఖ్యాతులను జేయునానా। జాతిప్రసవములుగోయు జలజాతముఖీ॥ (క) విరిలోఁగించిద్దళమునఁ।బరమేశ్వరుఁ బూన్పనింద్రపట్టంబొసఁగున్। వరశక్తిసంపదలుగల। కరవీరములివియు కోయుకంజాతముఖీ॥ (క) ఉడిగిన తావులపువ్వులు।గడిబోయిన పుష్పములును కందినవిరులున్।తొడిమెల బాసినపువ్వులు। పడతీ పూజింపరాదు పర్యుషితంబుల్॥ (క) రాజప్రసూనములచే।రాజాధరకిరీటు భక్తిరతిఁబూజింపన్। రాజగుణముక్తివసుధకు।రాజిత రాజాధిరాజరసికోత్తముఁడై॥ (క) శతపత్రంబులఁబూన్చిన।శతపత్రప్రమథసకలసంయమిదివిష। చ్ఛతమన్యులువినుతింపఁగ। శతరుద్రప్రమథసదృశసామర్థ్యుఁడగున్॥ (క) వాలినదుర్భవపాతక।జాలమునఁదూలించిపుణ్యసంపదలొసఁగున్। జాలినమహిమల నొసఁగును। సి

పుష్పోత్పలపుష్పజాతి నిచయములోనన్॥ (క) పనసడిండక నెరిగుండరి। క
సుగంధకకరుకు గాక కదుఛిద్రముగా। కసలాము బిల్వదళములు। సహతునా
త్మునిఁబూన్పఁగలుగు నపవర్గంబున్॥ (క) విలసద హేమాగ శ్రీతు
లసీబిల్వములనరుఁడు ధూర్జటిఁబూన్పన్। గలుగును ద్వాదశలక్షలు కల
ధౌతప్రసవమాలికార్పణఫలముల్॥ (క) అలరులఁబూజలకంబెన్న। మ
లహారునకుఁ బ్రియము పుష్పములకఁ బూన్పన్। గలుగును నధిక శుభంబు
లు। అలరులఫలములకు శతగుణాధికమగుటన్॥ (క) పన్నగధరుఁ బూ
జించిన। సన్నవపుష్పముల ఫలములందుట యరు చే। యెన్నడు రిక్కఁ జోద్య
ములు। చ్ఛిన్నదళంబులభజించుఁ జిత్రముగాదే॥ (క) సకలప్రసూనములలో।
ముకుళీకృతచంపకాబ్జములు నవి దక్కన్। వికసితపుష్పము లహాణము।
ముకుళంబులఁజూచి గాదు ముక్క్యహ జగతిన్॥ (క) పత్రములలోననవిశత।
పత్రోత్పలకనకబృహతిపత్రము లైదున్। ధాత్రి నిషిద్ధము లిఁకఁగల। పత్ర
ములన్నియును జెల్లు భవుఁబూజింపన్॥ (క) అభినవమును గోమలము
నుప్రభగలిగిన సకలపత్రపుష్పము లెల్లన్। శుభవిభవంబుల నొసఁగు
ను। నభవునిఁ బూజింప యోగ్యమందురు మహాత్ముల్॥ (సీ) ఈపు
ష్పములఁ గాదె యీశ్వరుఁ బూజించినమరుల సుతులఁగా నదితి గాం
చె। నీపుష్పములఁ గాదె యీశ్వరుఁబూజించి మనుజులు దేవత్వమ
హిమఁబొంది। రీపుష్పములఁ గాదె యీశ్వరుఁ బూజించి సుందరిభృ
గుపత్ని శుక్రుఁబడసె। నీపుష్పములఁ గాదె యీశ్వరుఁబూజించి యు
మృతాంశు బుధు గానత్రి వడసె। ననుచు నవ్వనవీథియందధికనియతి।
సకలలికచప్రసూనముల్ చాలఁగోసి। వేమ లన్నియు వేరె మాలికలు జే
సి। సరససల్లాపములఁ బలెకె జలజగంధి॥ (క) రావే విలాసినీమ
ణి। రావే వనితాలలామ రావే రమణీ। రావే చకోరలోచన। రా
వే కలహంసగతుల రాజీవముఖీ॥ (సీ) చామంతు లివె తెమ్ము సీమంతి
నీమణి కమలాక్షి మహిసాక్షి కలుగఁ దెమ్ము। కంబులు పుండరీకంబులు
కడు నవకంబులై నవి దెమ్ము కంబుకంఠి। కోమలి గొజ్జంగి క్రొన్నిరు

దేవమ్మ పన్నీరు దేవమ్మ పద్మగంధి । పాటలగంధి దే పాటలచ్ఛటలు గంధసారంబు దే గంధసారగంధి । అభవు బూజకు వలయు ద్రవ్యా బు లెందు । నేమి గావింప వలయునో తెలియవలయు । వింతలైన వి వివరించి వెలంది దెన్నం । అనుచు నియమించి చెప్పుచు నజ్జముఖులు॥ (సీ) బింబాధరంబుల బిట్టలు వాబుల్లఁ దాంబూలసౌఖ్యామృతంబు లాని । వదనాంబుజంబులు వాడకుండఁ మోవి యలరుటాకుల గుత్తు లానుకొనుచుఁ । బూతశాఖాదులు జొంపంబులై యున్న శీతలచ్ఛాయలఁ జేరఁ నిలిచి । కరపుటమ్ములను రక్తము లూర కుండంగఁ గరిపయోజంబులఁ గటి ఘటించి । మెల్ల నేతెంచె ప్రౌఢకామినులు గొలువ । జితమనోభవు సైన్యవాంఛితవదాన్య । గానచైతన్య సర్వలోకైకమాన్య । సుదతి చంద్రవతీకన్య సుగుణధన్య ॥ (గీ) కిసలయంబులు కెంగేలఁ గిలుకొలిపి । మంచిపూజేని చెమటచే మకరికించిపువ్వగుత్తులు కుచములఁ బొందుపఱిచి । వెలఁది తనువల్లియల దీఁగవీడు పడఁగ॥ (వ) ఇవ్విధంబున విహారంబు సలిపి శృంగారస్రూఁదోట వెలువడి యేతెంచి కాంచె నంత ॥ (సీ) శ్రీనగప్రోత్సంగశిఖరాగ్రసంసంగ వేణికోత్తుంగ నవీనసంగ । యుభయతీరకుడుంగ యుక్తపవిత్రాంగ జలజాతభృంగ సంచరరథాంగ । ఘనమత్తమాతంగ కపియుగ్మభాగాంగ సంభృతమదభంగ సదనుషంగ । కలుషభుజంగ ప్రకరకరాళవిహంగ సంయ్యామిన్యాసంగ శమనరంగ । అనువినాశ్రితనియతశుద్ధాంతరంగ । తటయుగాంబరజపితమంత్రప్రసంగ । సకలలోకైకవాధమ స్తకవశంగ । తరళరంగ త్తరంగపాతాళగంగ॥ (క) పాతాళగంగలోపల । నాతరుణులు తానమాడి రఘములు దొలఁగఁగ । భూతేశనామపఠన। ప్రాతలపావనశరీరభాజను లగుచున్॥ (వ) ఇవ్విధంబున

## —* చంద్రవతితీర్థంబులు దర్శించుచువానిం బ్రశంసించుట. *—

గంగాస్నానంబుఁ జేసి చంద్రవతీకన్య సఖీజనులతోడం గూడి తీర్థం

ములు దర్శించుచుఁ దీర్థప్రశంస సేయుచుఁ దొడంగె॥ (శా) కాశీసింధుసరస్వతీయమునగంగా ద్వారతీర్థాళితోఁ। బ్రాశస్త్యంచన దేవగేహములతోఁ బాతాళగంగాంబుతో। నీశజ్ఞానసుధారసజ్ఞ శివయోగీంద్రామరశ్రేణితో। శ్రీశైలాగ్రముఁ గాన నొప్పెనదిగో శ్రీపర్వతస్వామితోన్॥ (ఉ) కోమలిఁ జూచితే పసిడికుండలతోడి సువర్ణమందిరం। బామహాదేవు గోపురము లల్లవె కంటివె యీనగంబు సాం। ప్రామహిమంబు లీనదులు యన్నదరం బెనమళ్ళివాయతీ। ధామమితిపుణ్యరాసి శిఖరంబు గనుంగొన భాగ్య మబ్బెనే॥ (చ) సుజనుఁడు శృంగముల్ గనిన చూపులు ముక్తిపురీకవాటముల్। విజయవిలాసతన్ దెరచు పిమ్మట చాతురి యేమి చెప్పనీ। త్రిజగములందు నద్భుతము దృష్టికి వాటపు కుంచకోల యా। గజదనుజాంతకుండు కడగట్టిన కీటకతంత్రసూత్రమో॥ (మ) యమకోణంబున రుద్రపాదములు పుణ్యస్థానముల్ గంటివే। ప్రమదారత్నమ చంద్రగుప్తి నగముల్ ప్రత్యక్షకైలాస మా। ప్రమథుల్ దేవతలాదివాసివరులున్ బ్రచ్ఛన్నరూపంబులోఁ। బ్రమథేశున్ భజియించు తావు లివియో పద్మాక్షి వీక్షించితే॥

(సీసమాలిక.)

- (శ్రీకోటివింగాది) శ్రేళికాగహ్వరబ్రహ్మమాధవరుద్రపర్వతములు భగణజాటీసింధుపావనప్రోత్తుంగ తరపోషుభంగపాతాళగంగ। నవగహ్వరోదగ్రవసుధా కుండికావిలాద్భుతము కదళీవనంబు। శంకరునకు శోభనాంకంబు పాలంక నియతనిరాతంక నిష్కళంక। యతులితాంభోజ గర్భాండ దివ్యౌషధికూటంబు శ్రీచంద్రగుప్తశిఖరి। యఘకమిణ గ్రుంక దేశముననఁ బంకము నించు హేమనిర్మలాంబు నర్కేశ్వరంబు॥ పాతకాత్ముల వీడదఁ బనకె యుల్లంఘించి తోలఁగు త్రిపురాంతతీర్థకతో యధారు। ముక్తివిలాసివి ముఖముకురఖ్యాతి శాశ్వతోన్నతిశిఖరేశ్వరంబు। స్వాగామపగాదిసారసౌఖ్యప్రదాత్రశత

ము కర్మారీశ్వరస్థలంబు। కాంచనగర్భేంద్రశైలతటప్రతిభటోపాస్యసా
రంగేశభవ్యమూర్తి । చంద్రదివాకరచక్రకుండక్షేత్రదివ్యఘంటాసిద్ధతీ
ర్థరాజి। చండపాతకతిమిరఖండనపాండిత్యశాశ్వతోన్నతిహాటకేశ్వ
రంబు । ఫణిభువనాపగోద్భటశుభావిర్భావధికపృతిభోగవతీనదంబు।
బ్రహ్మలోకవ్యాప్తబహుళతీర్థశ్రేణిఁ దగడు సరస్వతీతీర్థతటిని। మం
జులబ్రహ్మాండమహాతతీర్థస్థలి గుహాపుణ్యాలతి మల్లె గుండసరసి। త్రిపుర
ఘస్మరశివశ్రీదివ్యావగాహయుఃపరిఖావికట్టిక భావి మొదలు। పుణ్యతీర్థ
వ్రజంబుల పుట్టినిల్లు। తాపసశ్రేణికిని దపోధనగృహంబు। బహుళపుణ్యో
న్నతంబు శ్రీపర్వతంబు। శేషయోగీంద్రహృదయేశ శ్రీగిరీశ॥(వ) ఇవ్విధం

—(*) చంద్రవతి పర్వతలింగంబుఁ బూజించుట. (*)—

బునఁ దీర్థప్రశంస సేయుచు నేతెంచి పర్వతలింగభవనంబునకుఁ బ్రద
క్షిణంబు వచ్చి దండప్రణామంబుఁ జేసి సమ్ముఖంబున॥ (క) హాటకశైల
విహారుఁడ। హాటకమందిరము నెదుర నను రాగమునన్। తాటంకినీలలామ
లు। ఆటలపాటలను గొలిచి రచలాధీశున్॥ (శా) అంభోజంబుల భావ
నాంభముల పూజారంభవిస్రంభతన్। శుంభద్వల్లిలల హేమకంకణమణి
స్తోమప్రకాశచ్ఛటల్ । జృంభింపన్ గడుఁ దోయజాతమునఁ బూజిం
చున్ బ్రయత్నంబునన్। శంభున్ జంద్రవతీవధూటి శివపంచబ్రహ్మమం
త్రంబులన్॥(క) కాలాగరు గుడి గవాక్షాంతరవిధులదశాంగధూపము
నిండన్। లాలాసురభిహారకందరహాలాహలనీలకాంతి కనుసారణిసై॥ (క)
కంతుహారి సమ్ముఖంబున। కాంతలు కర్పూరదీపకళిక లొనర్పన్। దంతి

—(*) చంద్రవతి పర్వతేశ్వరుని స్తుతించుట. (*)—

ముఖజనకజూటీ । కాంతారసుధాంశుచంద్రికాప్రభ వారయన్॥ (గీ)
ఎల్ల పువ్వులఁ బూజించి యుండువదన। మల్లికాదామమిశ్వరు మకుటవీధి।
నించి పూజింప వేలుపుఁ జేటిభావమునుకరింపుచు నుండె నిట్లభినుతించె॥

(శా) శ్రీకంఠాయ నమోస్తు తే భగవతే సీతాంశుజూటాయ తే। శై
కుంఠాషిసమర్పితాయ దివిషద్వంద్యాయ తే దేవతా। నీకాభీష్టఫలప్ర
దాయ కరణోన్మీలత్కటాక్షాయ తే। లోకేశాయ నమోస్తు తే యను
చు నాలోకించుఁ బూజింపుచుఁ॥(శా) విద్యుత్కాంతిజటాకలాప య
భవా విశ్వేశ నీపూజచే। సద్యోముక్తములౌ నఘంబులు మరున్సంఘంబు
చేఁ బాయునే। ప్రద్యోతప్రబలప్రతాప మగు నాథానుప్రభన్ గాక
యా। ఖద్యోతద్యుతివాయ నేర్చునెమ పాఁఖర్వరధ్వాంతముల్॥(మ)
కరిపోతంబు తదీయమాతృకుచ మాకాంక్షించుఁ గా కెట్లు। పూకరివ
ట్రోజము చేర నాపపదునే కామారి నీపాదసం। స్మరణానందసుధారి
సజ్ఞుఁడు నినుఁ సంధించుఁ గా కాన్మలోఁ। బరదైవాంతరముల్ దలం
చి మదిలో భావించఁగా నేర్చునే॥(మ)హరి నీభక్తియు నీపదాబ్జభజ
నం బర్థించుఁ గా కెట్లు నీ। కరుణాపాంగసుధారసప్లుతశుభాకారప్రక్రి
యాపేశలుఁ। డరుగన్ జూచునె యన్యమార్గముల కాహ్లాదంబుతోఁ
జేటి। క్రొవ్విరితేవ్మ్ముల్ విహరించు బచ్చిలి విరుల్ వేమారు సేవించునే॥
(క)సరి గావు నీదు భక్తికిఁ। బరమతపోయజ్ఞవిధులు పదివే లైనన్। కరు
ణింపు నాకు శివ నీ। చరణాంబుజ భక్తి జన్మజన్మము లందున్॥(వ)అ

—(✽)చంద్రవతి పర్వతేశ్వరుని మెదుట గానము చేయుట.(✽)—

ని యివ్విధంబున నభినుతించి గానవిద్యావిలాసంబున కభిముఖయై॥(క)
ఏవేళన నేరాగము। లేవీణెలఁ గూర్చి పాడ నీశ్వరహిత మౌ। నావేళ
ల నారాగము। లావీణెలఁ గూర్చి పాడు నభినవగతులన్॥(వ)వీణోత్త
మంబు బ్రహ్మవీణ కైలాసవీణ సారంగవీణ కూర్మవీణ ఆకాశవీణ రా
వణవీణ గౌరీవీణ బాణవీణ కశ్యపవీణ స్వాయంభువీణ సరస్వతీవీణ భు
జంగవీణ కిన్నరవీణ లావణ్యవీణ జనకవీణ మనోహరవీణ గణనాథవీ
ణ కుమారవీణ కుంభికావీణ విపంచికావీణ రావణహస్తంబు స్వరవీణ
పరివాదిసీవీణయంభోజవీణ స్వరమండలంబు రుద్రవీణ మొదలైన వీణె

ఇంచితి నీదృఢభక్తి మతికి । గానవిద్యా విలాసంబున కడు ఫలించె నెఱంది రౌప్యాద్రి యిష్టంబు లేదు మనిన॥ (వ) అమ్మహాదేవునకుం బునఃప్రణామంబులుం జేసి మహానందకందళితహృదయారవిందనై యిట్లని ప్రస్తుతించె॥ ••• ••• ✱

## చంద్రవతిప్రార్థనంబునం బర్వతేశ్వరుండు మల్లికార్జున లింగనామంబుం దాల్చుట.

(సీ) శ్రీనీలకంఠాయ శీతాంశుజూటాయ మదనాంతకాయ నమశ్శివాయ । కాలాగ్నిరుద్రాయ కాలసంహరణాయ మన్మనోక్షాయ నమశ్శివాయ । లాలాసురాంధకోల్లాసదిక్ఛేదాయ మహామహస్పదాయ నమశ్శివాయ । కమలసంభవశిరకరనీరజాతాయ మద్వల్లభాయ నమశ్శివాయ । పార్వతీశాయ ప్రమథసంభాషణాయ । సకలలోకైకనాథాయ శంకరాయ । దివిజవంద్యాయ శర్వాయ తేనమోస్తు । అనుచు వినుతించి పలికె నయ్యంబుజాక్షి ॥ (గీ) వరదనేబూన్నవర్తనశణార్హమైన । మల్లికాదామ మెల్లుడు సీమాళిం దాల్చి । మల్లికార్జునలింగనామంబు నీవు । అవధరింపుము ఇదియ నాకభిమతంబు॥ (క) ఈమల్లికాప్రసూనపు । దామము గంగాపగాంబుధారణలీలన్ । బ్రేమంబునధరియింపుము । కామాంతక తుహినధామకళయును బోలెన్॥ (గీ) అనినం బరమేశుం డవ్వరంబ బతివ కొసంగి । అంబికానాథుండా నామ మవధరించె । నిఖిలకైవల్యసౌఖ్యంబు నెలంత కొసంగె । దేవసంఘము లెల్ల నుతించి రంత॥ (చ) తలిరుల మల్లికాప్రసవదామములన్ శివమంత్రయుక్తిగా । నలికమున్ దనే యొకట నాడట కంతుం డనంగుం డయ్యె నీ । మలయజగంధి నేడు శివమంత్రయుతంబుగ మల్లెపువ్వులన్ । మలహరుం బూజచేసి యసమానమహత్వముం బొందె గంటిరే॥ (క) భక్తియె దురితవినాశని । భక్తియె సకలాపవర్గఫలసాధనమున్ । భక్తికి సులభుండు శంభుండు । భక్తికి సరిగావు క్రియలు పది వేలైనన్॥ (వ) అని దేవమునీంద్రులు

ప్రస్తుతింప సన్మహాశైవ జంగమార్చనంబుఁ జేసె నంత॥ (గీ)తరుణి పూన్చిన మల్లికాదామ మెవ్వరుదు। వకుటమందాకినీతటీమధ్యవీధి। నుసుప విలసిల్లెఁ జదలేటి నురువువోలె। నాటగోని మల్లికార్జుననామ మర్యై॥ (గీ)ఎన్ని దానంబు లవనిపై నెన్నఁబడును। నెన్నిధర్మంబు లవనిపై నెన్నఁబడును। నవియు విధ్యుక్తముగఁ జేయు నట్టి ఫలము। కలుగు శ్రీగిరిలింగంబు గాంచినంత॥ (క) ఇనుఁడీ శ్రీగిరి మహిమలు। వినిన మనుష్యుండు వినందు విక్రమవిష్ణో వనగమలు లాయభీకర। ఘనగళఘంటాకరోరఘణఘణరవముల్॥ సీ॥ గోకర్ణ గోకర్ణ గోకర్ణ సేవ్యంబు కాశిక కాశిక కాశికంబు। శ్రీధర శ్రీధర శ్రీధరావాసంబు కామద కామద కామదంబు। నిర్వాణనిర్వాణనిర్వాణ శుభదంబు భైరవ భైరవ భైరవంబు। గాంధర్వ గాంధర్వ గాంధర్వమఖిలాలి శైలాది శైలాది శైలయుతము। అంజనాద్రుశ్య వినుతవిద్యాధరవంద్య। సకలసంజీవనీజయస్తంభకుంభ। కాయవరకాయభోగినీకాయసిద్ధి ఫలదమహిమోన్నతంబు శ్రీపర్వతంబు॥ అనిన వేదవ్యాసుండు తరువాత కథావినసనం బెట్టి దనిన సనత్కుమారుం డిట్లనియె॥ (క) పంచబ్రహ్మమనస్తుత। పంచాక్షరమంత్రపఠనఫలసుస్ఫూర్జా। పంచాంబరీషగవిజిత। పంచశరోద్వగవిహంగ పర్వతలింగా॥ (మాలినీ) పరమమహితచిత్రా భస్మసందిగ్ధగాత్రా। గురుశుభచరిత్రా। కుంజరిత్వక్కటిత్రా। దురితతృణలవిత్రా దుష్కృతధ్వాంతమిత్రా। భరితగుణపవిత్రా శ్రీపద్మజస్తోత్రపాత్రా॥

గద్యము॥ ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగగుణవర్య శేషనాధార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
జతుర్థాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ రస్తు.

---

శ్రీభ్రమరాంబాసమేత మల్లికార్జునస్వామినే నమః

శ్రీపర్వతపురాణము - పంచమాశ్వాసము.

---

శ్రీశైలపుణ్యమహిమము । లా శైలతనూజ వినుచు నానందసు
ధా। నాభిరసకేళిఁ దేలుచు। నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి పల్కెన్॥

## శ్రీపర్వతంబునందలి మూఁడువృక్షంబుల మహిమ నభివర్ణించుట.

(గీ) శ్రీగిరిస్థలమధ్యమక్షేత్రమహిమ। యట్టి శ్రీగిరిశృంగత్రయంబు మహి
మ। లందు వెలసిల్లు వృక్షత్రయంబు విధము। తెలియ నానతిఁ గృపసేయు
దేవదేవ॥ (వ) అనిన నమ్మహాదేవుం డంబికాదేవికిఁ గరుణార్ద్రహృద
యుండై కటాక్షించి యిట్లనియె॥ (సీ) అమ్మూఁడు శృంగంబులందున న్నద్భు
తసమారూఢి వర్తించుఁ దరుత్రయంబు। తద్భూరుహంబులు దర్శించు
నరులకు సర్వాభిమతములు సంభవించు। నొకమ్రాని మొదలును నొక్క
మ్రానితుదయొక్క మ్రాని మధ్యము నంటు మానవులకు। ధారుణి స్వర్గపా
తాళలోకంబులన్ గలచరిత్రము లెల్లఁ గానవచ్చు। నొక్క వృక్షమూలంబు
నొక్క తర్పువృక్షత్రయమొక్కటి యొకటివృక్షంబు దాల్చు। వరుస బ్రహ్మాచ్యుతాం
బికేశ్వరుల క్రమోల। క్షింపు దీపింప నియతిఁ గ్రీడించు నతఁడు॥ (క) నొకభూరు
హంబు కాయలు। నొక భూమీరుహమ్ము పండు నొకతరుబీజం। బకలంకుఁ
డైభుజించిన। ప్రకటించి చరించు నతఁడు ప్రమథులలోనన్॥ (సీ) త
ద్భూరుహంబులు దర్శించు టెట్లన్న మహాదేవు బాలుట్ల మల్లినాథు। భృ
త్యోపచారుఁడై పెరుఁగును నెయ్యిని బాలును గూడ ముప్పందుమునను। న
భిషేకమొనరించి యాదేవుని సహస్రకలశాభిషేకంబుగా నొనర్చి। య

—(*) కవిరాజవిరాజితము. (*)—

కురంగభృంగయుతస్వచ్ఛం। శశిచ్ఛవిగుచ్ఛసుధారసకచ్ఛజటాఝటసము
లిచ్ఛందం।గర్వితలాంధకఖర్వటహారణాఖర్వశుభ్రతిగంధవహవిహారం। దు
ర్వహఘనచర్వణదనుజసుపర్వనుతశ్రీపర్వతలింగా ॥ ౫ ॥ అద్రిభవమిం
త్రి భవచిత్రకరనేత్ర శతపత్ర సుపవిత్రతవిచిత్రచారిత్రా।పంకజదృగం
క మకరాంక హరకింకర వశంకరశశాంకధర శంకర మహేశా॥ అక్షు
ద్ర విపక్ష సురరాక్షస బలక్షపణ లక్ష్యసితలేక్షణ కటాక్షవిక్షేపా।ద
క్షసవశిక్షణసమక్షసంధృక్ష శివ రక్ష మాంపర్వతాధ్యక్షా॥ ఉద్యానసం
తతకదంబంతేషు ప్రసవములనిర్మలకీర్తిః నీవా స్తవ అభ్రము పరివృద్ధవిభ్రమ
మనస్కృతా। శరదభ్రభ్రాజచ్చంద్రాభ కుందాదభ్రశ్రీ భ్రమద్యుతయః శు
భ్రమహాభ్రనదీప్రతిసిద్ధయః । సురతరుగుచ్ఛాయాపరిస్ఫురితాగుచ్ఛస్ఫ
టికస్మృదయః । స్ఫాయతురుముదస్ఫగద్యోతా స్ఫుటవిచకిలలతిస్ఫూర్తిః
స్ఫురణాధారస్యట్టహాసప్రకృతికృతయః । అక్షయకరుణాలక్షణవిచక్షు
ణ। యక్షాముని రక్షాదక్షకక్షత్రక్షుభితక్ష్వేదాక్ష్వేదితరక్షక్షేత్రక్షపణ
క్షమవిలశ్రీమత్పర్వతమల్లీశ్వరమూర్తీ॥ శ్రీపర్వతపురసింహాసనవర।లిం
గచక్రవర్తీ శ్రీగిరిమల్లీశ్వర।వర్ధనస్వజటాటవికోటితపాటలసుమనస్త
టినీయుక్తా । రుచిరబిసప్రకరశరజలదసురద్విరదమతుధరణిరుహస్వజవ
ననిర్వాయదలిభీతికమణిస్ఫారహేమస్ఫురద్భృగస్ఫూర్తిధగద్ధగితలసద్ధ
వళనయనః॥ ౮ ॥ అని స్తుతియించి యిట్లని విన్నవించె॥
(క) కంజభవాండోదుంబర।సంజాతసకృష్టజంతుసంసారమహా। మం
జులనాటకమాయా । పుంజము సురవైభవంబు బుద్ధిం దలంపన్॥ (క)
నిత్యేతరు లింద్రాదులు । నిత్యుండవు నీవు నిఖిలనిర్మాణభవా।నిత్యా
చరణక్రియార్థణము । లత్యుత్తమపుష్పభూరుహములై యుండన్।(గీ)
భగణ నిన్నెట్లు వృక్షరూపంబుం జేసి । అభవయిందులపుష్పంబు లవ
ధరింపు । దేవలోకేశ శివజగద్ధితచరిత్ర । పరమపావనభవ పరబ్ర
హ్మరూపా॥ (క) అలికాక్ష తత్ప్రసూనవు । దళములం బూజించున

## తపస్వి తన్ను చెట్టుగా జేసి పువ్వులుగోయించి పూజకై కొమ్మనికోరుట.

ట్టి ధన్యుల కెల్లన్ । బలభేది విభవ మొసఁగును [illegible] జింప నొసఁగు నపవర్గంబున్॥ (గీ) అనుడు నసమానబహుమానుఁడును నట్లయొసఁగ । వసుధ విలసిల్లె గంభీరవన మనంగ । చెట్టువాకిఁగా నరా చీవనంబు । ఘనుఁడ సీపుణ్యఫలమునఁ గానవచ్చె॥ (క) కనలదు మింకఁ దపోధన । కనలితి వేనిపుడు మమ్మఁ గానఁగ రాకుండిదిక రవీరవనక్రమ । మది పుణ్యసరోవరంబు మది యెట్లన్నన్॥

### —* పుణ్యాఖ్యసరోవర ప్రశంస. *—

(సీ) పుణ్యాటవుదుకదమ ధీవర పారీసహితమై తాపసాశ్రమము వోలె । దారుణ బకకంక ధార్తరాష్ట్రవ్యాప్తి నభిమత వ్యాసకావ్యంబు వోలెఁ । జి కాలయుతమహాజీవ నస్థితియందువర మంత్రసిద్ధ దేవత యుఁబోలెఁ । గచ్ఛపవానరగళంఖస్థూలపద్మావి స్ఫూర్తుబధననాథు పురమువోలెఁ । బుష్కరోత్ఫుల్లహల్లకపుండరీక । ఫలితమకరందవిభ్రమభ్రమత్కర । గాయకోత్తమబంహిష్ఠగానఘోష । రూఢనుఖదంబు పుణ్యసరోవరంబు॥ (గీ) లోకపావని పాతాళలోకమార్గ । మీసరోవరమాహాత్మ్య మిదిమదీయ్య । విధముఁ జెప్పెద వినవయ్య విమలచరిత్ర । పావసింతును శాంకరీపట్టణమున॥ అట్టిపురంబున కట్టి నామం బె

### —(*) శంకరీపట్టణనామప్రశంస. (*)—

ట్లయ్యెవంచేసి॥ (ఉ) బాలికనై భవాని హిమపర్వతపుత్రికయైన నాఁడు తా । శ్రీలలితాంగి బొమ్మలకుఁ జిత్రపువన్నెల బొమ్మ పొత్తికల్ । చాలఁ గఁగొంచు రమ్మనుచు సమ్మదలీలల నేగి జాహ్నవీ । కూలపవిత్రదేశమునఁ గొమ్మలతో డుత నాడుచుండఁగన్॥ (క) సురకన్యలు నహికన్యలు । గిరిక

న్యాసము దయంబు కిన్నరకన్యలన్। వరరుద్రకన్యకలుహిమ। గిరికన్యకఁగూం డి మెచ్చు క్రీడియొనర్చన్॥ (ఉ) అంబిక జాహ్నవీతటమునం దొనరిం చెనుబొమ్మరిండ్లచం। దంబున నొక్కపట్టణము తత్పురమధ్యమవీధిభక్తి తో।శంభుఁ బ్రతిష్ఠఁజేసి జలజాననయుత్సవపంబు సేయఁ ఫా। లాంబకుడం బుఁగైకొని సమంచితసౌఖ్యము లందుచున్నెడన్॥ (క) జలజాయతా క్షియుప్పురి దలఁచిన శివుడెటిఁగినీవు దలచినపురియున్। నెలకొలిపితినీ పురి గాఁదలఁచిన సికతాపురంబు తామరసాక్షీ॥ (వ) అనినవినియుభ వాని యత్యంత సంతోషాయత్తచిత్తయై ప్రస్తుతించె నదనంతరంబు॥ (క) శంకరు నర్ధాంగనయగు। శాంకరి జలజాయతాక్షి సంధించుటకున్। శాంకరిపురమనఁ బరగెను।శంకరు భజియింతునచట సమ్మానమెసఁగన్॥ (క) నాపేరుప్పొంతుఁడు। శ్రీపర్వతమునకువచ్చి శ్రీగిరినాథున్। శ్రీ పాదము లర్చింతును దీపితశివభక్తియుక్తి దృఢనియమములన్॥ (గీ) ఇ ట్లువతిలించి యొక్కనాఁడీవనంబు। పుష్పనివహంబుఁ గోయంగఁ బో వువారి గూడ నేతెంచి యేను నగూడి యొక్క।ఘోరనిస్సాణ పటహాని ఘోషమెసఁగ॥ (క) అప్పుడు దశదిశలందును।గప్పెడు గతిదప్పికీలుక డురయమునఁ గా।కప్పెనధరణిన్ బడుటయు।నప్పుడుతనుఁబట్టబన్నగాం గనలెల్లన్॥ అరుగుదెంచి (గీ) యువతులంతంత ప్రియమునవల్లసం బు।నజప నసలారఁ దన్నునెన్నడుము దొడికి।యింతు లిరుగుబ్బపాలిండ్లు నిరియఁబట్టి కదిసికొనిపోదు రభినవకళలతోడ॥ (వ) అందులోనొక్క పొలింధాంగన నీవుపృత్తాంతంబుఁ జెప్పెద వినుమనియిట్లనన్॥ (సీ) పూ ర్వజన్మంబున భోగీశుఁడనులింగమునకుఁ బూజాబంధములు రచించ నొ క్కపుష్పంబులో నొకతేటిదగిలిన తప్పునకై నీవు ధరజనింప। వలసెనన న్నులవాఁడవుగాన నిన్నుభవుఁడు కరుణించు ననుచుఁజెప్పి। నాతులఁగొని పోయెనాగలోకంబున భోగవతీనదీ పులినతలము। నందు నిలిపిన దివ్యదే హంబునొందె। తెలిసెజాతిస్మరత్వంబు దృఢముగాఁగ। బరమవిశ్వాస భక్తి నాస్సర్యచర్య। భోగనాథునిఁగనిమొక్కిట పూజసేయు॥ (గీ) పుణ్య

ఫణిదామయుతుండగు భోగినాథు। నెమ్మి పూజింపననుఁ గర్హణింపుచట।
చంద్రకోటీరు శ్రీగిరీశ్వరు భజింతు। ననుచు నామానితనక్షరి కరిగెసం॥

—(*) వృషభబిలవృత్తాంతము. (*)—

(సీ) వినవయ్య మరియును విపినాంతరంబున కేబత్తికిఁ బ్రీతి వడుగు నెడను। నందొకట యాబోతు నచలింపఁ బ్రభుతోడ నున్నతాకృతిఁ జూచి యుల్లసిల్లి। నొకట పుణ్యుఁడు సముత్సాహభక్తితో నం బ్రదక్షిణం బాచరించి। పలుమారు మ్రొక్కుచుఁ బ్రణుతించి వృషభంబు నెక్కడమఁగడితాసీబిలంబుఁ। జొచ్చిన నామది చోద్యమందుచువచ్చి యూయయ్యకును మ్రొక్కి యతనిఁ బొగడి। యెందనుండుదు వెవుడ నీవెవ్వరనఘ। యిట్టి వృషభంబు నెక్కడి కేగు తెఱంగు ఇంత సంభ్రమమేల యింకేల సిద్ధి। నీకు నియ్యాన చెప్పుము నిక్కమనిన॥ అందు నాంప సి యిట్లనియె॥ (సీ) వినవయ్య యితఁడాదివృషభేశ్వరుఁడు కర్మజనులకు వేల్పొక్కట చదమొందు। జగముల రెండవ సర్వేశ్వరుండన నాద్యుండు శ్రీపర్వతాగ్రజుండు। నాలుగు యుగముల నాల్గు పాదంబులఁ జేయుగాంగ రక్షమఁ దెలిఁగి నడుచు సప్తరాత్రంబులు జనులెవ్వరేనియు ననశనవిధి నేకాగ్రచిత్తుఁ। డగుచు నీబిలమార్గంబు నందు నిల్వ। నంతఁ గృపపుట్టి వృషభేశుఁ డరుగుదేర। తొలఁగకా వృషభేశుని తోఁక బట్టి। బిలములోనికిఁ గొనిపోవు బ్రధులగతిని॥

(క) వృషభపురీప్రాంతమునను। వృషభేశుఁడు గొంచుఁ బోయి విడుచు నతండుఁ। వృషభేంద్రతీర్థఁ మాడియు। వృషభేశ్వరుఁ బూజసేయు విమలాత్మలకున్॥ (గీ) అంతఁ బ్రత్యక్షమై వృషభాధినాథుఁ। డెల్ల కార్యార్థసిద్ధుల నిచ్చుచుండు। వారిలోపల మోక్షాభివాంఛితులకు। నెల్ల కైవల్యవిభవంబు నిచ్చుచుండు॥ (ఉ) కామితభోగము ల్త్రిగణికాపరిరంభణదివ్యసౌఖ్యముల్। కామదుఘావళుల్ సకలకల్పమహీరుహసంచయంబులున్। గామశరీరసంపదలు కామనిషూదనుఁ డిచ్చు నిచ్చలున్। గా

మింతభక్తి గొల్చి ఘనమహాత్ములకుఁ దయతోడ వెండియుఁ॥(వ) ఈవృషభేశ్వరుచేత నిష్టార్థసిద్ధిసముదయంబులు వడసి సాధకుండు॥(చ) తమ నిజవాసముల్ దలఁపఁ దప్పక యీవృషభేంద్రమూర్తి యా। వ్విమలతనుండు నిల్చి నను విశ్రుత వాలముఁ బట్టినన్ నిజ। క్రమమునఁ దెచ్చి యుబ్బిలముఖంబు దెస న్వెడలింప నిష్టితార్థములను సంభవించు నని తాపసముఖ్యుఁడు చెప్పె వెండియున్॥(మ) చన నల్లంతట నొక్క నిర్మలను

—(*) తాళవృక్షప్రశంస. (*)—

జడేశస్థానసంకీర్ణతా। శనమధ్యంబున నుండె నేను ఫలముల్ వాంఛారతిన్ గోయుచున్।కనుఁగొంటిన్ భువి నొక్క తాళదివి దాఁకన్ వీడియందుండి తాఁ గ్రనసిశంబున్ ధర కేదిగన్ బెరుఁగఁగా నా తాళవృక్షంబుపై॥(మ) కనుగొంటిన్ శతరుద్రు డగ్గిరి కివృక్షారూఢుఁడై కొల్వఁగా। వని కీర్తింపఁ దపస్వి దోఁచెఁ దపసుం డ్యాంతమున్ గ్రుంకినన్। ఘనతాళంబును గ్రుంకఁ దాపసి ధరాగ్రస్థాయినై యుండినన్। జనిమే న్యాని నుతించు వేఁడితి మహాశ్చర్యంబు సంధిల్లగన్॥(గీ) తాళదివి కేగి యిట్టుల ధరణి గ్రుంక। వెలవ కేరీతి నిల్చితి వృక్షశృంగ। మెక్కి యెవ్వారిగంటి యుండే మిహిర్ధి।భూజ మెప్పాటు నీకెట్లు పొందు పడియె॥ అనవుడు తపస్వి యిట్లనియె॥(క) జననుత యీ ప్రాంతంబున। మన కడనై నిల్చి యాదయువజ్జనకాలంబున లింగము పూజ సేయుచు। ననవరతధ్యాననిష్ఠ నలవడియుండన్॥(సీ) తుదల నకాలాంశులు దోఁపంగ సితాదితుదయాకులును మట్టతుకల దోఁచె। నుదయాదిదీధితు లావవంగ నీమాఱ్లిను నుదయాద్రిక్రమాకులు నుద్గమించె। మొదలమయూఖముల్ మొలవ నీవృక్షంబు మొదలి పత్రంబులు మోసులేసె। కొదమనూనూగు వేగొనలు దేవులు సాగదుది మోసుటాకులు వొంగలించె। పొదలి భానుండు యుదయింప భూరుహంబు। వేచిన యంతంత నుప్పనఁ బెరిగి దివికి। వినుతలింగార్చనక్రియావేళభక్తి రీతి నుంటిని సిస్థాగరిష్ఠమునను॥ (క) రవిరథ మేగెను దివి

కీర। దివి వాఁకను దరువు పెరుఁగ దిరముగ నుండఁగ।, నవకవలక
ణిఁ కాంతర భవనస్థితి నున్న యట్టి భ్రమరముఁ బోలెఁ॥(గీ) తపనుమ
ధ్యాహ్న వేళ బాదపము దరియ। వలినమిత్రుండు హర్షించి నన్నుఁ జూచి।
యినుఁడు సత్కారసంతుష్టహృదయుఁ జేసి। అనఘ యెయ్యది యీప్సిత ము
డుగుమనిన॥ (వ) దినకరుఁ జూచి యిట్లంటి॥(సీ) సప్తాశ్వవిఁవయ్యా
సర్వాదిసారభామోత్తమశ్రీగిరి యనికీర్తిపట్టు। హరిపద్మసంభవాద్య
మరాధిపతినైన మల్లికార్జునుఁడు మహాప్రభుండు। వేడుక సింగటకంబె
పెట్టొందు భాగ్యంబుగలుగ నేటికి నాకుఁ గమలమిత్ర। యేమియు నే
వొల్ల నీ తాళవృక్షంబు ఈక్షితి నుదయించు టేమి తెలుఁగు। చనఁగ న
నుఁగ కొనసాగశక్తి యెట్లు। గలిగినను మోచు టిది యేమి కారణం
బు తొట్టితెలుఁగు సీభువి గ్రుంకు టేమి వినము। తెలియఁజెప్పము యిం
తయు తీవ్రకిరణ॥ అనిన నతనిఁ జూచి సూర్యుం డిట్లనియె॥ (వ) శ్రీప
ర్వతుని తపోమహాత్మ్యంబునం జేసి శ్రీనగంబుమీఁద సూర్యతాళంబులును న
క్షత్రతాళంబులును వెలిసెందు సూర్యకుండంబున స్నానంబుఁ జేసి సూర్యే
శ్వరలింగంబును బూజించినవారికి సూర్యపదంబు గలుగు। నిట్లు ద్వాద
శాదిత్యులు తమతమ పదంబులు వడసిరి। యీశ్వరానుగ్రహంబున సూ
ర్యతాళంబెక్కి వచ్చినవారికిం గామింపలేమి యెఱుఁగ బద్మరాగమణులైన
గొమ్మునిచ్చెద శ్రీగిరీశ్వరుఁ బూజింపఁబొమ్మని యొప్పించి సూర్యుం డరుగ
నకుఁ జంబును భూగర్భంబుం జొచ్చి మల్లికార్జునదేవుం బూజింపఁ
బోయెదనని యంతయు దపస్వి చెప్ప వింటి మరియును॥(సీ) వెండియు
నొకనాఁడు విపినస్థలంబున నుండంగ దన ముందట నొకఁ డుఁభీతిఁ। గొని
యురంబున నంటుకొనియున్న యర్భకశవము దానును వచ్చి చక్రి ని
లువ। నోరోరి భీతాత్మ యెక్కడ నుండి నీ వేతెంచితివి యిది యేమి శవము।
యేపురంబున నుండు దెప్పుడు చెప్ప డవనుచు నాతనిఁ జేరి యడుగ వా
ని। వినుతపిసవయ్య పులి నుండి వేగఁ జూము। గదలి వృక్షంబులకుఁ బోవఁ
దుపు గదల। జెలనదీతీరమునఁ జేరి సజ్జ పెట్టి। కొంత దవ్వేగి కూ

చుండెడి కుతుకమునను । ఇట్లు శౌచంబునకుం గూర్చున్న వేళ ॥
(క) మావాకిట లజ్జింపక । యీవెంగలి యిట్లుసేయ నుచితమె
యనుచున్ । భావించి నాల్గు దిక్కులు । వేవేగమ చూచి చాలవిస్మ
యమందెన్ ॥ (ఉ) ఇక్కడ నూరు లేదు మరి యిల్లును గాదిది యేమి చో
ద్యమో । అక్కజమంచు నొక్కశిలచెక్కడ నిక్కవగా నొనర్చి తా ।
జిక్కన గొంత దవ్వరిగి శౌచము సేయుఁదొలంగు సంతలో । నక్కడ నిట్లు
వల్కెనచు నక్కడ నక్కడ రాలనిర్చెనన్ ॥ (చ) సరభసలీలఁ గొంతదవుచర్య
న నేగి తొలంగి తాఖపిం । శ్చరణము దీర్చి యంతటను శౌచము నా
చమనక్రియాదులున్ । బరిణతి నాచరించి పురభంజను నీశ్వరుఁ బూజఁ జే
సి తాఁ । గరమున దొప్పఁబట్టుకొని గ్రమ్మఱ నేగితి దొంటిచోటికిన్ ॥
(క) కండువ దప్పక నటభి । త్కాండహియటంచు నడుగఁ గమలదళా
క్షుల్ । మండట మేనలు చూపక । యుఁదలు నే తెంతు రచటి కన్నముగొ
నచున్ ॥ (ఉ) పంకజలోచనల్ మృదులపల్లవకోమలబాహువల్లరీ । కం
కణనిక్వణన్మణివికాసము శుద్ధగ నొప్ప హైమతా । టంకమణిచ్ఛటల్
కిరణటంకవిటంకవిఘట్టనప్రభల్ । పంకజమిత్రుతో నొరయు భామలు
భిక్షముఁ దెచ్చి పెట్టుచున్ ॥ (గీ) అతివయందిచ్చు దివ్యాన్నమనుభవించు ।
పుణ్యఫలమునఁ గంటి తత్పురవరంబు । అంతనప్పుడు కమలాక్షుయుంబు నగు
డునలినపత్రాక్షి యొక్కతె నన్నుఁ జూచి ॥ (సీ) తనపురంబునకు న త్తె
రుణి తోడ్కొని పోయి నవసౌధవీధిపై నన్నునునిచి । అభ్యంగనాదిక్రి
యాన్వితుఁ గావించి రమణతో దివ్యాంబరములు దాల్చి । షోడశాభర
ణసంశోభితుఁ గావించి గంధమాల్యాదిశృంగారుఁ జేసి । బంధురదివ్యా
న్నపానంబులను దన్పి పొలఁతి కర్పూరతాంబూలా లిచ్చి । వనిత మరి
యొసఁగి నన్ననవరతభోగ । సౌఖ్యాంబునిధిలోనఁ జొక్క జేసి । చా
రులోచన మరి దివ్యవరణకోట్లు । సలుప దగ్గభా జొందిన లలన
జూచి ॥ (క) సక్కంబు నాథు నీసతి । దక్కఁగ దాయనుచు నా
స్వాందలంచిన భావం । బకాలమినితనమదిలో । నొక్కింత మారింగిన

జిహ్వాయుగ్మతి యంతన్ ॥ ( ఉ ) చెచ్చెరగర్భమున్ దనదు చేతు
లయంబునుఁ ద్రచ్చి యర్భకున్ । బుచ్చి మదీయదేహమునఁ బోమ్మని
వైచినదాని నెప్పుడో । వచ్చిధరాతలంబునను వ్రాలితి యిట్టిదిఘం
దమంచునే । నచ్చెరువందఁజెప్పి ఫిరి కమ్మనజోత్తముఁ డేగ వెంతి
యున్॥ (సీ) అంతటనే వినోదార్థమై యేగుచుఁ గను గొంటి నొక

—(*)బాలబిలప్రశంస. (*)—

గిరికంధరమున। నొకమాసబిలములో నుండి యేతెంచివఁ గాంచియా
ముని యాసన్నకడకు నేగి। యెక్కడనుండి సీవేగెదవనవుడు నిదిబాలబిలమం
దురందు మొదల। గదలక దినసప్తకము నిష్ఠతోనుండ నొకకొండబిలమున
నుండివచ్చి। సరసపంచామృతముచిక్కు నవతపాప। యింతి నిటుపట్టుమ
నిచేతికిచ్చిపోవ। కంటకంబునవాపోవు గరచువచ్చు। సాధకోత్తము తను
వృమాంసంబుదినగ॥ (క) తలకక కండ్లింకరవక కలఁగక కరపద్దమిడక
కదలక మదిమై। నులుకక బెదరక యదరక। యలఁగక మెలఁగినను దేవ
తాంగన మెచ్చున్॥ (క) ఆపసిత దివ్యదేహము। గావించి యభీష్టసిద్ధి క
రుణించినసం। భావనముఁ బొంది యిచ్ఛా భూవలయంబునకు నెట్లుపో
యెదననుచున్॥ (గీ) యోగవాగాలు వెట్టి యాద్యస్తుఁడగుచు బహుళ
శిలలందుఁ బదిలమే పాలనసిన। తాపసోత్తమ వినవయ్య తత్రిమంబు.అ
నుదునమ్మని యిట్లనియానతిచ్చె॥ (సీ) కల్పోక్తిపదముంది కడురయం
బునఁ ద్రోవఁ బర్వతాకృతినొక్క పాము నిల్వ తద్వదనము బిలద్వారంబు
గాఁజొచ్చి సపణంబుకడతను శంకలేక। ప్రథితశూలాకృతి పావాలనేమె
ట్టి శ్రీకంఠుఁ బాదుకాసిద్ధనాథు। కడకేగి మదిలసద్గౌరవంబు జలంగద
శించినిష్టచౌతనరనిపుడు। మూలపంచాక్షరీమంత్రమున జపింప। నురగ
రాజు నుప్రకటలై యుర్వినుండ। చూచి కడకేగి మరుగునఁ జూచుచుండ। న
ట్లమరియొక్క సపణంబు నధివసించె॥ (క) ఉరగంబుగడచి ముందట।
దరిద్రొక్కుచు నిలిచినీరు ద్రావు నపేక్షన్। సరసీజలములు మెట్టిన। కరము
లు దెగిపడినపుడు కడువేగమునన్॥ (క) కదియం బట్టితునకలు। మొ

దలసుసంధానకరణి మోపినకడకన్। ముదమంది జలము దోఁచిన। నసికత తటరిపాణి గాఁ నరుఁ డందిమదిన్॥ (చ) అనఁగనంతముఁదటముఁదాంధగజంబులు పార్వఁ దెంచి పిన్। నరములు సోఁకకుండఁగొని కత్తరిపాణియె మీఁదఁజల్లుచున్। కరుకు దేహముల్ మసియఁగావడిఁ బారుమదేభరాజితా। నరుఁగఁగనంతరాలు దమనంటఁగఁజిక్కిన భద్రదంతులన్॥ (క) ఘనతుండంబుల నిడుకొని। యనిశంబు శిలోదకంబు లనివార్యటదెసన్। గని చల్లిన నవి వాయుండు। చనియేనుఁగులన్ జూచి మరియు సమ్మదమెసఁగన్॥ (గీ) తాను గరపత్తులశిలోదకంబుఁ బట్టి। యెదుట ముందటనంటు రాలంటుకొనఁగ। దడయకంతంత నాశిలోదకముఁ జల్లి। ధరణి నటమీఁద వెనువెనుకఁ దాఁటిచనఁగ॥ (సీ) భూమండలము ననభోమండలమునిండి సర్వదిక్కులుఁగప్పి సమధికముగ। యోజనోన్నతమును యోజనాయతమునై యుండు బిలంబులోనొక్క తరువు। గనియాకుజంబు మార్గంబని యెక్కఁగఁ దనకంతనొకకోఁతి తరువుఁ బొందె। నమ్మహీరుహశాఖ నందందనాటుచు నురుకుచుఁదిరుగుచు నుండ నంత। నిక్కమాఁకలి పుట్టినందొక్క ఫలము। తానుభక్షింప నొకచిలుకతనువుఁ బొంద। మాని మీఁద నాచిలుకన్నైమసరిమసరి। క్రమముమీఱఁగనొక తరుశాఖగదియ॥ (క) తనకంత భ్రమరతనువై। ఘనపరిమళపుష్పరేణుకాంతామతితో। ననవరతంబునుదిరుగుచు। చననటఁగగనమునసొక్క శైలముపొంతన్॥ (ఉ) శ్రీపరమేశ్వరార్చనము సేయుచునుండు మహానుభావునిన్। దాపసిఁజూచి యేనడుగుదమ్ముల మీఁద వసించునంతట। రూపముమాన్చి దివ్యమగు రూపముగా మునినాథుఁడిచ్చెది। వ్యాపితవర్తనల్ సుజనవంద్యుఁడు దెచ్చి దయార్ద్రచిత్తుఁడై॥ యంత సాధకునింజూచి యాతపస్వి యిట్లనియె॥ (గీ) సాధకోత్తమ యిదియె ఖేచరబిలంబు। మరియు ముందర పెను

—(*) ఖేచరబిలప్రశంస. (*)—

మంటమందుమాఢ్కి। నున్నపావకశిఖలుపై నురుకనీకు। యోగవాగాల గతినుండుయోగివర్య॥ అనిన సంతోషాయత్తచిత్తుఁడై॥ (క) ఈతాప

సి చెప్పినక్రియ। నాకతనుగుహ గహ్వరాఖిలయందు రుకుదుఁబ్రస్ఫురాగ్నియో
గవాగల। భాతిఁ సిద్ధించుఁదనకుఁ బరమేశుకృపన్॥ (సీ) పడసిసహ
స్రాగ్ర పరిమితంబయ్యును సర్వసిద్ధులునాకు సంభవించె।గమకింతుయో
గవాగలుమెట్టిదలచిన భువనంబునకుఁబోదుఁ బుణ్యచరిత।నాగలోకస్వ
ర్ణనలినంబు వీపించు భోగవతినదిపుణ్యజలము। భాగీరథిని దెత్తు భవ్యో
దకంబులు కలువలు పుండరీకములు దెచ్చి।శర్వునర్చింతుఁ బర్వత సార్వ
భౌము। నంబికాధీశు శ్రీమల్లికార్జునేశు । నభవుఁ బూజింతు నను చు
నాయతియు సరిగె॥ అనినఁ దపస్విఁ జూచి సాధకుం డిట్లనియె॥ (సీ)
ఒజ్జలశిష్యుల కుపదేశములు చెప్ప ఎథమునఁ జెప్పినవెఱవనేను। చాలునీ
ధర వింశ్రీగిరి మహిమలు ఎన్నంగ నాపద్మజునకుఁ దరమె । మెట్టు
దు పులినైన మోహింగా రాకుండ భంజింతు కడకాలఁ బట్టియే
ను । దక్ష నాగమనంబు తద్య మిట్టిది పెను దారిక్ష నేబిలమైన దోఁ
చిపోదు । బిహ్వాలము లేక మదిఁ ఁతు విఘ్నములను నీదుశివలాంఛనం
బులునిన్నుఁ జూచి యోడిలంఘింపఁ జాలకయుంటిఁ గాక । చాలినన్నాగశ
క్యమె సంయమీంద్ర॥ అనుడు తపస్వి వితర్కించె ॥ (క) మదివెఱఁగు
నొంది యుక్తులు । వెదకుచు దనముకుర మీదవేలిడి శిరముఁ । గది
యించిదిన కళాసము వదలించుచుఁ జంకిసిడుచు వేగమెచనుచున్॥(వ)

—(*) భైరవబిలప్రశంస. (*)—

ఇవ్విధంబున వీనిఁ జికిరింపరాదనుచుఁ దపోధనుం డద్భుతాక్రాంతుండైనఁ జూ
చి సాధకుండును నతనిఁ గుటిలతపస్వి గా నెఱింగిచన సంతసమున్న భై
రవుండు బిలద్వారంబున నొక పెబ్బులి రూపుదాల్చి యుండె నంత॥
(సీ) జితదైత్యకరవాలజిహ్వా సాగగనిచ్చి యాయుతదనగహ్వరము దె
ఱచి । బ్రహ్మాండకపటరప్రగ్రాసకబుద్ధిని భీకరాకృతి నేచిబిట్టులాడు। గం
డుమహేంద్ర సంఘాతంబు లూటాడ నిశ్వాసపవనంబు నిండనిగుడ ।
ఘుట ఘుట ధ్వని శైల గుహలు చిల్లులు వోవ నింగినాకసకుడు
ఫంగ రొప్ప । నెడద కొనిచూచు కన్నుల నిప్పులురుల । బద్ధమా

త్వగ్గ్వవిద్రో మోఽపాక్రమాత్మ । భగ్నానిర్భరః క్రమఘుటవేళ । ఘూన
ఘోరవ్యాప్తి శీర్ణమూర్ణాలపుంగవుండు ॥ (చ) కరువు మదంబు కేసరినిగా
యము కోపమశేషసృష్టికో । తరురవిసజాలమున్ శిఖిశిఖాతతి వేడిమి
వాయుతీవ్రమున్ । సురగపురాజతీవ్రగయుఁ జొక్కము గానొకమాపు
దాల్చిని । భరతగతినిల్చి బెబ్బులి యాభయంకరదర్శనమహోగ్రమూ
ర్తియై ॥ (ఉ) పొంగుచు బుగ్గరింపుచును ఘోరగతి దాఁటుచుమీఱి పా
లుపన్ । మ్రోఁగుచు నావులింపుచును మూల్గుచు మీసము లోరగిం
చి తా । నంగము సాఁచి నిల్చిగాలికాగ్రము సుక్కిరుఁడ వాల మూఁ
చుచున్ । ముంగల జిహ్వసాఁగ నిడి మూతులు నాకుచుమాత్తరింపు
చున్ ॥ (వ) ఇవ్విధంబున భయంకరక్రియ దాల్చిన బెబ్బులిన్ జూచి సా
ధకుండిట్లనియె ॥ (సీ) పులిరక్కసుని గావు బొంతు గాఁచోలు నాజ్వల
నాక్షునే మున్ను సమసె నేని । యీబిలాంతరము నెట్టున్నవాఁడో కో
యుగ్రాక్షునకు నోడియున్నవాఁడో । తపసి చెప్పిన పులితానకో నొ
ప్పడు దారుణనిష్ఠ్యాతదర్శనరూపి । నీక్షింతు వ్యాఘ్రంబు శీఘ్రంబజం
తుపుల్ గలవె నాముందఱ గదిసి నిలువ । దొలఁగకున్నను ముందఱఁ ద్రి
ళ్ళగిలిన । గ్రోవ యీకున్న మసలిన తొట్రుపడినఁ । జిక్కరాకింక
యదియు నాచేత మగుడి । చనఁగ వచ్చునె మదీయంతు సాహసమున ॥
(శా) దండింతున్ దలకింతు చేత నడతున్ ఘట్టింతు గారింతు మై । ఖండిం
తున్ మడియింతుఁ గొట్టుదును ద్ఘాటింతు సాధింతును । ద్దండకోద్ధసవిస్ఫు
లింగకణసందర్భప్రతాపోగ్రతా । ఖండాడంబరగర్వరేఖ యడఁతున్
గంభీరశౌర్యోన్నతిన్ ॥ (వ) అనుచు నుగ్రతపట్టు నమ్మాశ్రిలోఁ బర్వ
తాకారంబున నేల వ్రాలిన బెబ్బులిన్ జూచి సాధకుండు ॥ (గీ) బెదు
రక్కెంతయు నదరక భీతిలేక । యులుగ కదరక చింతింప కదరిపడక । యులు
కకోడక తలఁగక యుదరిపడక । తొలఁగిపోవక తలఁగక తొట్రుపడక ॥
(సీ) ఒకచేతఁ బులిమీసలొడిసి చయ్యనఁబట్టి యొకచేతఁ బులి దౌడలో
సంచరించి । చరణంబు చరణంబుఁ బల్లకొన సవరించి ధరను వెలకిల

సూకిదండినాచిఱ। పులియు నదృశ్యమై పోయెఁ బోవుటఁగాంచు కలను మే
లొందనిచూచు కరణిసుండు। నంత తొల్లిటి యట్ల గురుఁడుగ ముందట:
బ్రభవించె నంతలో భైరవుండు । విపులఘోషంబు గనుఁగొనివీని యెదు
ర। గెలువ కారని బిలములో గల్లు మీరి । మారుకొని యుండు వహ్ని
యై మండుచుండు । బిలముమధ్యంబుఁ జొచ్చె నాసాధకుండు॥ క॥ ఇ
రికిట మగుచును । సరి మురి నొకకొంత దూర మరుగఁగఁగని । ట్లొగ
కంబుగఁ గూర్చుండియు। నరుకున దనరాక దారి యరుగుచునుండన్॥
(క) అటముందర దావానల । చటులార్చిః ప్రభలుబిలము చయ్యనని
డన్। నిటలాక్షుకంటి మంటలు। పటువగు రాత్రిని సంధించినభంగిన్। (గీ)
జడిసిపోవక వీక్షించి సాధకుండు । వడిని దాఁటుచు వహ్నిలోఁ బడిన న
చ్చి। పలుక ప్రత్యక్షమై నిలిచి భైరవుండు । అధిక శౌర్యంబు సాధకున
దగు మనుడు॥ (వ) సాధకుండు భైరవుం జూచియిట్లనియె॥ (సీ) నీవి
చ్చువరమేమి నేమిగోరెది దేమి యీబాంధవ్య మీలనా కీశుఁడుండ। ననఘ
నీసారూప్యమనిసలజ్జాశూన్యకడిభాగమున భయంకరపు రూపు। సాలో
క్యమనినిసిచ్చులర క్తశవసురామాంససంఘాత సమాకులంబు । సామీ
ప్యమేని పిశాచోగ్రశ్వేతాశ్వకాలభూతాదిసంకరతమంబు । నీవుబసఁగి
నవరము నేనిచ్చగించ। వాంఛతో దూత పదివేలవరములిచ్చు । నట్టి దయ
కాదెవక్రగుణంబు విభువు। వలదు వైషమ్యబుద్ధి యెవ్వారియందు॥ (క) ప
రహితవర్జితకంటక। తరువ్రలు ఫలవృక్షములకుఁ దానే వెలుఁగై। పరి
వేష్టించినవిధమున। గురుజనులకు నిట్టివక్రగుణములు దగునే॥ (క) పర
హితమును కైవల్యము । పరిమాన్పినఁబరహితంబు సమధికమైనన్। బ
రహితవర్తులెయుంభో । ధరపవనసుధాకరాది ధార్మికులెల్లన్॥
(క) పురుషార్థగుణంబున। దరువ్రలు పశువులును శిలలు తద్యములై
వ్యేన్। పరహితకారిత్వముగల । పురుషుఁడు త్రిభువనములందు పూ
జ్యుండనఘా॥ (వ) అనిచెప్పి భైరవులీడాని సాధకుండుముందట నొ
కపుణ్యనదీప్రవాహంబుగని కృతస్నానుండై తత్తీర్థమాహాత్మ్యంబు

ను దివ్యాంగుండైన తన దేహకాంతి దిగంతవిశ్రాంతంబై వెలుంగుచున్న
దేహద్యుతిఁ గాంచి హర్షించి ॥ (సీ) కమనీయమాణిక్యఘనకవాటో
న్నతకలధౌతశివమయాగారమునను । మండితరమ్యహర్మ్యస్థలాగ్రము
నందుఁ గాంచనమయభేరిఁ గాంచియతఁడు । తద్దివ్యలింగంబు దర్శిం
చి ప్రాజించనభేరి వ్రేయించి సాధకుండు । నిలువనంతటిలోన నీరజలో
చనయుందుబింబానన వేగుదెంచి । సాధకోత్తముఁడన నిల్పి జలజము
ఖులు హావభావక్రియాదులనంగకళల । తరుణులాతనినైరావతస్థుఁ జే
సి॥(వ)అని చెప్పి యాదివ్యవైభవంబున కధీశ్వరుం జేయ నూహించి॥(ఉ)
కోకనదప్రసూననవకోమలకాంతిపికస్వరాంగనల్ । కోకిల కంఠమా
ధవ సుఖోద్గమభాషలు కంబుకంధరుల్ । కోకసమానవృత్తకుచకుం
భలు మత్తగజేంద్రగామినుల్ । నాకచకోరలోచనలు నవ్యవిహార వి
లాసవిలాసవిభ్రమల్॥ (క) పంకజనయనలు కాంచన।కంకణమణిరవ
ము లెసఁగఁ గలశంబులతోఁ । బంకజముల నిడియుదకమలంకారముతో
డఁ దెచ్చిలలనలు వేడ్కన్॥ (క) మంగళవాద్యరవంబులు।మంగలమొలి
యఁగను చిరమునవ్విభునకున్ । గంగాజలాభిషేకము।సంగతముగఁ జే
సివిభవసన్నాహముల॥ (గీ) మడుఁగువస్త్రంబులును గంధమాల్యము
లును।పురుషునకునిచ్చి మాణిక్యభూషణములు । దొడిగిదివ్యాన్నపాన
సరితుష్టుఁజేసి।బహుళవైభవశాలియై పరిఢవించు॥ (గీ) అమరకాం
తలతోడిసౌఖ్యామృతాబ్ధి ననియు సుఖియించు నాచంద్రతారకంబు।అంత
మీఁదట శాశ్వతంబైన ముక్తి।దివ్యసౌఖ్యానుభవములఁ దేజరిల్లు॥క॥మరి శ్రీ
గిరిసరిగలదను।నరుఁడకు సిద్ధించు బ్రహ్మహత్యాదురితముల్।ధరలోఁ బుణ్య
స్థలి శ్రీ।గిరి ప్రతి గలదె స్వర్గమర్త్యపాతాళములన్॥ (శా) కాయం
బున్ బెడఁ బాసి ముక్తియుతుఁడౌ।కాశిస్థలిన్ మోక్షసం।ప్రాయిత్వం
బు భజించు మానవుఁడు కేదారంబువుల్ గ్రోలినన్।కాయక్లేశము లే
మిఁ జెప్ప సుఖియై కాయంబుతో ముక్తిఁ బొం।దాయాసంబులు మా
ని శ్రీనగము శృంగాగ్రంబు వీక్షించినన్॥(క) ఏగతి గలుగును యోగా।
భ్యాగతులై యూర్ధ్వరేఖ యుమివరులకు నా।ట్లాగతి మహిమను గల్గు

గను శ్రీగిరి వతించు సకలజీవుల కెల్లన్॥(సీ) ఏపర్వతంబున నెనసిన యవి సర్వలోకోపకారకౌషధములు। ఏగిరిస్థాన బ్రవహించి నదిన వంత లంబురాసలకుజనన్మంతరంబు। ఏ శైలాద్రిస్థ సర్వమహితగంధ శైలములన్ మందరకైలాసమహీధరములు । ఏమహీధ్రమ్మున బంహిష్ఠ కాష్టంబులు సంజీవనీయు స్తంభనములు।తృణము లన్నియు దివ్యౌషధీగణములు। సిద్ధవనమూలికలు దేవసిద్ధికళలు।అట్టి మహిమాస్పదములకు నాలయంబు।బహుళశృంగోన్నతంబు శ్రీపర్వతంబు॥(ఉ)వేలుపు టేటితో మిసిమి వెన్నెల గాయు విశాల జూటితో।శైలజ బోటితోఁ గమలసంభవు బాయు కరోటి కోటితో।మేలిమి పేటితోఁ గరము।మించిన కీర్తి రమాపధూటితో।నేలును శ్రీనగంబు గిరిజేశ్వరుఁడిష్టఫలప్రదాయియై॥(క)సారము శ్రీగిరి త్రిభువన। సారం బని శ్రుతులు చెప్పి చాటఁగ వాంస। క్షీరమివాంభసి గతియును।సారమె చెప్పను విశిష్టశబ్దార్థములన్॥ (వ) అనినఁ గృష్ణద్వైపాయనుండు ఆనందకందళితహృదయారవిందుండై దేవా తరువాతి కథావిధానం బెట్టి దని యడిగిన నమ్మునీంద్రునకు సనత్కుమారుఁ డిట్లనియె॥(క)సుజనఫలదా మరుద్రుమ।గజచర్మకటీపటీర కందర్పహరా।రజతగిరిశిఖరమందిర। భజవర శ్రీప్రమథసంగ పర్వతలింగా॥ మాలినీ॥అసురనగరజైత్రా యద్రికన్యాకళత్రా।భసితలసితగాత్రా భక్తహృత్పద్మమిత్రా। అసమజలధితూణా యబ్జపుత్రీశబాణా। ప్రసవవిశిఖభంగా పర్వతాధీశలింగా॥ (శా)భవ్యస్వర్గనదీలురజ్జలచరభ్రామ్యత్తరంగచ్ఛదా। నవ్యాంభఃకణధౌతహాటకకళానంభాజటాజూట సం। సేవ్యస్తోకసుధాకరా గిరిసుతాశ్లిష్టార్ధదేహా భవా। దివ్యశ్రీగిరిశృంగమందిర మహాదేవా జగన్నాయకా॥

గద్యము॥ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్ట్రభాషా
విశిష్ట శివయోగగుణవర్య శేషనాథార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
బంచమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీమల్లికార్జునస్వామినేనమః.

శ్రీపర్వతపురాణము॥ షష్ఠమాశ్వాసము.

శ్రీశైలపుణ్యమహిమల। నాశైలతనూజ వినుచు నానందసుధా। రాశిరసకేళిఁ దేలుచు। నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి పలికెన్॥ (క) శ్రీనగ పుణ్యసుధారస। మౌని ముదంబందె మానసాంబుజము సమా। ధానంబు నవికసించెను। ఆనతి నీవలయు నీకథాద్యంతంబున్॥ (వ) అని యడిగిన

—(❀) శేళికాబిలవృత్తాంతము. (❀)—

పార్వతీదేవికి నమ్మహాదేవుం డిట్లనియె తద్బిలసాధనక్రమం బెట్టిదనిన శ్రీపర్వతలింగంబును షోడశోపచారంబులం బూజించి యనుజ్ఞాతుండై యరుగుదెంచి చలింప కాబిలాంగణంబున నిల్చి నిశ్చలచిత్తుండై॥ (గీ) బావి విలసిల్లు తద్బిలప్రాంగణమున। వీరపుంగవుఁ డచట నిర్విఘ్నముగను। శంభు బూజింపుచును లక్ష జపము జేసి। యతఁడు నిశ్చలచిత్తుఁడై యధివసింప॥ క॥ ఎడపకను భావిలోపల। వడి నుదకము దాఁగి వ భాను వారమునందున్। కెడగూడి రుద్రసంఖ్యలు। వెడలున్ జెలి యపుడు దాను వేడుకయందున్। ఆచెలులు జలంబు త్రావం జూచి సాధకుండు॥ క॥ జలములు త్రావిన పిమ్మట। బిలమున కరుగంగఁ బాసి పిమ్మట వాలం। బలమి గొని పట్టి యాతఁడు। చలనం బింతయును లేక చయ్యన నంతన్॥ సీ॥ ధర నిరువది యొకట ధనువంతరంబు లరుగంగ ముందట నతిశయిల్లు। కాంచనకుంభ సంఘటిత దీప్తులతోడ నభిరమ్యమగు హేమహర్మ్యమునను। భద్రాసనములైన భవలీలతోన్నత భద్రేభగామిని పద్మనయన। బలవధూమ్రుదుపాణి పరమకల్యాణిని సైకతశ్రోణిని శక్తిఁ గాంచి। మానసం

బుననిల్చి నమస్కరించి । భయమును భక్తియు దీపింపఁ బ్రస్తుతించి
యంత ముందటఁ గాంతదవ్వరిగిరిఁ । పురుషపుంగవుఁ డాగెఁగాంచు
పురవరంబు॥ (క) హాటకగోపురములతో । హాటకమణిదీప్తపురము
నభిమత మందఁగ।హాటకలింగము గుడిలోఁ।బాటలగంధులును జూచి ప్ర
మద మెలపఁగ॥ (క) పలుకులును జిలుక పలుకులు। కలహంసికనతు
లు సతుల గమనస్థితులుఁగ।కలువలును కన్నుగవలును।గలయకతోఁ జెలి
మిసేయు కాంతలఁగనియెఁ॥ అంతట॥ (క) ఆకర్ణలోచనానవ ।
కోకనదప్రసవముఖులు కోకలనినదల్ । కోకకుచవిభ్రమంబుల।నాకవి
లాసినులు చేరి నరుగనంతఁ॥ (వ) ప్రియాలాపంబుల నతని సేమంబ
డిగియుచితాసనంబునఁ గూర్చుండి నియమంబున సాధకు జూచియిట్ల
నిపలుకునంత ॥ (క) ఎవ్వెడ నుందువు నామం।బెయ్యది వృత్తాంతమ
నఘ యెఱిఁగింపుమనఁగ। నెయ్యము తో సాధకుఁ తా। తొయ్యలులకు రాక
ముదముతో నెఱిఁగించెఁ ॥ (సీ) కంకణఝుణఝుణత్కారంబు నూపు
రారావంబు మెఱయంగ రభసమునను । బువ్వారుబోణులు పుణ్యోద
కంబుల నభిషేక మొనరించి యతులమైన । మణుఁగులు గట్టించి మంచి
పన్నీరును గొజ్జంగి పూనీరు గుంకుమంబు।పచ్చికస్తూరియుఁ బచ్చకర్పూ
రము మెదచిన గంధంబు మేన నలఁది । మసలి చుకలతో మారుమల
యు కాంతి । గలుగ కట్టాణి ముత్యాల కంఠమాలి।కలును నూతనమా
ణిక్యకంకణములు । పుష్పమాలికలపిఁ నొంచి పురుషుఁజూచి॥ (క) సా
ధకుని యూరుఁ బేరును।సాధకు తల్లియును దండ్రి సాధకుకులముఁగ।సా
ధనపత్రంబులచే । సాధనపత్రంబు కేల సతియిడినంతఁ॥ (క) ఆయతి
వ పసిఁడికిన్నెర । సాయన మిచ్చినను గొనుచుసాధకుఁడు నవ। ప్రా
యబలవిక్రమక్రమ।నాయతమహిమమున దివిజుఁడై గవిఁ యంచుఁ॥ (శా)
నీరేజాసనుఁ డెంత నేర్పరిజయోన్నిందుఁ డైవస్వతుం । డారాత్రిం
చరుఁడే బలాన్వితుఁడు తీవ్రాశుండు తేజస్వి యే । శూరుండే యని
లుండు పాశధరుఁడుఁ సుత్రాముఁడే భోగివి। స్తారప్రక్రియ నే

నిగదాధండంబుచేఁ ద్రిప్పుచుఁ॥ (వ) ఇట్లు వీరాలాపంబులు వలుకుచు దేవతాస్వరూపంబు ప్రాదుర్భవించిన మహాత్వంబున నహంకరింపుచుండునంత॥ (గీ) అతివ నవ్వుచు సాధకు నగ్రవీధి । నిలిచి పత్రంబు చదువుమాని నిజరేంద్ర । యనుచు నిలిచిన దివిజవీరాగ్రగణ్యుఁ। డాత్మలోపలఁ దెలియు వృత్తాంతమెల్ల॥ (క) వ్రంతలఁ జనివచ్చినగతి । యింతియు సానియము దనకు నిచ్చిన గోనక । త్యంతమహాత్వము గలుగుట । నంతయు భావించి నాత్మ నెఱుఁగుచు నంతన్॥ (వ) నిసయుపవేకజ్ఞానంబును రూపలావణ్యవిలాసంబులుం గల నిజరత్వంబు గలిగి నిరంతరసంతోషాయత్తచిత్తుండై॥ (క) ఈచందంబున సాధకుఁ। డా చంద్రుని కాంతి గలిగి యమరబలబలుండై। యాచంద్రముఖులు దానును। నాచంద్రార్కము సుఖించు నానందమునన్॥ (క) శ్రీశైలపుణ్యమహిమలు।నాశైలతనూజవినుచు నానందసుధా।రాసిరసకేళిఁ దేలుచు।నీశానునిఁ జూచి త్రిభువనేశ్వరి వలికెన్॥ (క) శ్రీనగమునఁ గల పుణ్యా।స్థానంబుల పుణ్యశక్తి సాధనఫలసం।ధానములు తద్విశేషము।లానతిఁ గరుణింపవలయు నచలాధీశా॥ అనిన మహాదేవుం డకదళీవనమాహాత్మ్యంబు నిట్లని యానతిచ్చె॥ (సీ) శ్రీమల్లికార్జును సేవించి పూజించి యాదేవదేవు

## —(*) కదళీవనప్రశంస. (*)—

ని యాజ్ఞఁ బూని। శుక్లపర్వతమున శుద్ధాత్ముఁడై నిల్చి పంచోపచారప్రపంచరచన।సర్వలోకాధీశు శంభు నారాధించి కదళీవనంబు నీగతిన దెలిసి। యైరావతీనది నభిషిక్తుఁడై కల్పసరణి లక్షత్రయీజపము చేసి।మంత్రసంసిద్ధుఁడై భక్తిమార్గనియతి। నిత్యలింగార్చనక్రియానియతితోడ। సాధకోత్తముఁ డత్యంతసహజభక్తి। లీల నేతెంచి కను కదళీవనంబు॥ (సీ) కుందభూజములు ముకుందభూజంబులు చందనంబులు హరిచందనములు। రంభాదివనులు నారంభావనంబులు కుంభవృక్షంబు నికుంభతరులు। తాళవృక్షములు హింతాళవృక్షంబులు సాలభూజములు రసాలతరు

లు। కరవీరతరులు శ్రీకరవీరతరులును బిల్వంబులును జిన్నిల్లవృక్షములును। వర్ణభూరుహములు సువర్ణతరులు। కరజభూజంబులు బూతికరజములును। వనము గుంపును నధికపావనము సొంపు। లింబవనశోభనము కదళీవనంబు॥ (సీ) మదనరంభావ్రజమహిళాకదంబాదిసహితమై దేవతాస్థలము వోలె। నమర మునీంద్రగాయత్రిజపానేకసహితమయ్యును బ్రహ్మసభయుం బోలె। వసుధనాథవిరాజవరుణసుపర్ణాఖ్యవిరసమై హరిసభావేది వోలె। జటిలార్జునహరిశివాశరభవబ్రహ్మసంచయములై నీశ్వరస్థళము వోలె। కౌశికాగస్త్యచిత్రశిఖండివితతి। సముదయంబునం దాపసాశ్రమము వోలె। వనము గుంపును నధిక పావనము సొంపు। లికుచవనశోభనము కదళీవనంబు। (క) విటపిఘనపల్లవచ్ఛద। పుటకళికాము కుళవికచపుష్పపరాగో। త్కటమ్మదుశలాటుఫలరస। ఘుటికద్రుమ మనుపగాయకస్తుతి చెలంగన్॥ (శా) అత్యంతవ్రతులార్యకందఫలదుగ్ధాహారకుక్షింభరుల్। నిత్యారాధకులుంభక్తిరతుల్ నీవారముష్టింపచుల్। ప్రత్యేకప్రమథుల్ ప్రబోధితపరబ్రహ్మైకవాచయముల్। నిత్యాత్మల్ కదళీతపోధరవరుల్ షట్చక్రపారంగతుల్॥ (క) అతియుతపుదత్తోచిత। భిక్షాశననియమరతులు ప్రియభక్తివిరాపాత్ములు భజియింతు రటరు। దాత్రితో మాకందకుందతరుభవనములన్॥ (క) ఉటజోపకంఠభూములు। వటువులతో వేదభాష్యవాక్యార్థంబుల్। విటపిశుకశారికలు విస్ఫుట వాఙ్మాధుర్యపదకశుద్ధి వరించున్॥ క॥ స్థాణున కొసంగి విరులా। ఘ్రాణించున్ తుమ్మెదలు శుకమ్ములును ఫల। శ్రేణిభుజియించుమానులు। ఏణాంకధరోపహార మిచ్చినపిదపన్॥ (క) కదలిశుకకోకిలంబులు। పదశుద్ధిం బరించుం బ్రణవపంచాక్షరముల్। కదలి తరువీధిలోనవ। కదళీచ్ఛాశాశ్రితార్యకణోత్పలముల్॥ (గీ) అట్టివనభూమిగని పశ్చిమాంతరమునం। బుడమి పొడగంటినొక మహాద్భుతబిలంబు। దశియొక యోజనము మేర దాంటి చనంగ। వారి పూరితమగుసరోవరము గలదు॥ (క) తెలినీరును తలిరాంపను। పరికొత్తివ్వరి తేనెదోంగు పాశి

త్రావుల్।ఘట్టికింప కన్నుదెమ్మెర। లలరులపై తేటిదాటు లానినసరసిన్॥ (క) సిరసీకృతదురితహరా। త్పారసీయత్యున్నపాంత మరవరపాటీ।హరసేమోమ్మృతపావన। సరసీతీరంబుఁజేరి సాధకుఁడంతన్॥ (సీ) అడె సరోవరపావనాంబుమధ్యంబున నఘమర్షణస్నాన మాచరించి । సక లాంగకములంద శాంభవమంత్రంబు నందుభస్మోద్ధూళనంబుఁజేసి।యా నదీతటమునం దావిర్భవించిన సీలలోహితునిసన్నిధినినిలిచి। స్నానగం ధాక్షతపత్రమాల్యంబులఁ బుష్పాగ్రఘుస్మరు పూజఁజేసి। చంద్రకోటీ రునకుఁబ్రదక్షిణము వచ్చి।కృత్తివాసునిగని నమస్కృతులొనర్చి। పక్వఫ లములుదెచ్చి యర్పణముసేయఁ। గరళకంఠుఁడు కడుమెచ్చిగమనశక్తి॥ (క) పర్జన్యవంద్యుఁగ్రినయను। దుర్జయపురదైత్యహరుచతుర్బాహు యుతున్। నిర్జితపుష్పశరాసను। సజ్జనరక్షాకళా విచక్షణుశంభున్॥ (వ) అనుగ్రహంబువడసి యరుగన్ముందట॥ (క) కోరినకోర్కులనొ సఁగును।నీరజదళనయన మొగలిదేలికిని మహా। దారగుణరత్నభూషి త।కారుణ్యపయోధిసముఖమున కరుగుటయున్॥ ఆమొగలిసీశక్తియిట్ల నియె॥ (క) సాధకయిష్టార్థంబు । సాధింపఁగ వలసితెనిచయ్యానన న్నున్।సాధువిధిఁ బూజసేయుము। మాధుర్యాన్నములుదెమ్ము మత్ప్రి యకరముల్॥ (వ) అనివవినిసాధకుండు సంతోషాయత్తచిత్తుండై॥(క) ఫలములుముందటఁ బ్రోవుగ।నిలిపిన భుజియించిమొగలి దేవియునియర। స్థలమునఁగౌఁగిలించితను। తలచినవస్తియును గామితములు ఫలించున్॥ (క) ముందటవిఘ్నము లెవ్వియుఁ।బొందవుగమనింపుమనిన భూయిష్ఠశి వా।నందముగ నిన్నుఁగాంచును। నందనవన మర్ధయోజనంబున నతఁ డున్॥ (క) ఆరామఫలాదులనుప।హారం బొనరించునట్టి యానరునకు బృం।దారకసత్త్వమహత్త్వముఁ చే। కూరును జిరకాలదేహశుద్ధియుఁ గ లుగున్॥ (క) ఆకోలనిదక్షిణంబున। నాకోద్యాయంబుఁబోలినరమకు లీశ। వ్యాకోరసత్రసత్ఫల। శ్రీకరమైయొప్పువనము సిద్ధాశ్రయమై॥ అవ్వ నంబు నందు॥ (సీ) ంతాళఫలము భక్షణము జేసినవాఁడు జంభాసు

సారాతి సదృశుఁ డగును । వాతాశకఫలభుక్తి వలన సంభవమగు సిద్ధీంద్రవిభవంబు సిద్ధి మహిమ । గంధవర్ణ ఫలరసగ్రసనంబు గావింప గంధర్వులకునాదికర్తయగును। వన్యఫలంబు లెవ్వఁడు భుజించిన విద్యాధరాధీశవిభవ మందుఁ । గలుగు దాడిమఫల రసగ్రసనమునను। ప్రబలసత్వప్రతాపంబు భానుదీప్తి । చూతఫలభుక్తివలన సంశుద్ధుఁ డగును।తుహినకిరణునితోఁ దులదూఁగునతఁడు॥ (గీ) అందుహాటకత రుఫలంబనుభవింపఁ। గైటభారాతిసదృశవిక్రమము గలుగుఁ । జెందు కదళీఫలంబు భక్షించునతఁడు । విశ్వనాథునిసారూప్యవిభవ మొందు॥ (సీ) అట గొంతదూర మందరుగంగ మందర మహీధ్రంద నొప్పు నా మలకవనము। ఇంద్రనీలచ్ఛాయ నెకసక్కెమాడెడు పరిపక్వఫలకదంబములు గలిగి।అందులో నొక ఫలంబనుభవించిన యట్టి ఘనునకునింద్రభోగములు గలిగి।నాసమీపమునబిల్వావనంబులుగల్గు ఫలముభుజించినఁ ద్రుమధుఁడగును।దత్సమీపంబు ఫలపూరితరువులందు । ఫలము సేవింపయక్షేంద్ర పదము గలుగు । మఱియునత్యంత పావనమహిమ నొప్పు।బహుళచిత్రాభిరామంబు ప్రథమకదళి॥ (క) ధరణీరుహవనసంజీర। హరిణీ. నయనానుపాలనౌషధములన । ధరణీకృతసంజీవన। కరణీవివహాముఖప్రథమకదళీవనముల్॥ ప్రథమకదళిం బ్రవేశించు విధంబెట్టిదనిన॥(గీ) జనులుపూర్వోక్తసరణిమ జ్జనమునరిచి । గరళకంఠుని పూజించికల్పసరణి। శైవమంత్రంబు మూఁడులక్షలు జపించి । దివ్యసరసికి నటతూ

—(*)ప్రమథకదళీవన వృత్తాంతము.(*)—

ర్పు దెసకుఁ జనఁగ॥ (గీ) అంతముందట శక్తిసింహాసనంబు। దేజరిల్లును నెనిమిదిదిక్కులందు । ఖడ్గసంజీవనీఘుటికావశిత్వ। పాదుకామృతవజ్రిసంప్రాప్తకళలు॥ (గీ) సాధకోత్తముఁడటఁజూచి సాహసమున।నందులోపలవలయు ద్రవ్యంబుగొనుచు । నంతటముందటఁ గొంత దవ్వరిగిచూడ।నతిశయిల్లును దేవతోద్యానవనము॥ (క) విమలస్వర్ణద్యుమ

లా।ద్యుమణి మయూఖములసొంపులఁ దులకింపఁగ। బ్రమథాధినాథుగిం జా।రమణచతుర్ద్వారమందిరము శోభిల్లుఁగ॥ ఆమందిరంబునందు॥(క) హాటకలింగము సేవకక।వాటద్వారములయందు వసియింతురుశా। ర్వా ట్టోపతతులు వితరణ।పాటలవర్తనలు ద్వారపాలకముఖ్యుల్॥ (క)నా కేశదానవాదుల।చేకొనని పరాక్రమప్రసిద్ధోన్నతిచే।శ్రీకంఠు హేమగే హము।వాకిటనుండుదురు శౌర్యవైభవమతులై॥ (క) నిగమాగమార్థ వినతుని। నగజాధీశ్వరునిదక్షిణద్వారమునన్ । మగటిమినుండును భైర వుడగణితఘలవిక్రమక్రమారావమునన్॥ అంతట॥ దక్షిణద్వారభూమి సాధకుఁడు నిలువ।నుగ్రరూపంబుతో భైరవుండు వలుకు। నెందువచ్చెద వోరోరి నీవిచట నిలువు । సురలకైననునీగుడి చేరఁగరాదు॥ (క)అన వుడువిని సాధకుఁడును। ననవరతధ్యాననిష్ఠ నచలితభక్తిన్। వినుతింపు చుండు భైరవుఁ।డనుకంపను ఖేచరత్వ మతనికి నొసఁగున్॥వ॥మఱియు నాసాధకుఁ డుత్తరద్వారంబున కరుగ నకట్టడనన్న దేవాంగన యిట్లని యె॥క॥ అధముఁడ యిటు నిలువుము నీ।విధమెకట్టడ శివునిభక్తి విధమె కట్టడదు।ర్విధులకు మెచ్చఁడుశంభుఁడు । బుధులకు నీనగరిపొంతఁబో రాదు సుమీ॥శా॥ నారీరత్నము ప్రస్తుతింపవిని యానందంబు సంధిల్లఁ గా।హారంబిచ్చిన కంఠకోణమున నాహ్లాదంబుతోఁదాల్ప ని।ట్లారీతిన్ బ లవంతుఁడై యతఁడు వాగీశత్వమున్ బొందిగం।భీరజ్ఞానకళాకలాపము లజ్రుంభించున్ ప్రతాపోన్నతిన్॥అంతసాధకుండు పశ్చిమద్వారంబునకరు గునంత॥క॥ఆతతసప్తఫణామణి। జాతోన్నతకాంతియుతుఁడు సంపూ ర్ణబల।ఖ్యాతభయంకరదేహుఁడు।ధూతేశ్వరు భటుఁడు భుజగపుంగ వుఁడుండున్॥(వ)ఆభుజగాధీశ్వరుండు సాధకుం జూచి గంభీరభాషణం బుల నిట్లనియె॥ (క) బలిచిల నెకట్టడి కేగదు । కరికరి యిటునిల్వ వట్టి గవణం బేలా । కెలమాటలకును మెచ్చఁడు। గరకంఠుఁడు సహ జభక్తి గనులకుఁ దకట్టన్॥ (గీ) అధమమానవ నామాటయధిగమిం పు । ననక యిటు నిలుమనియు నెచ్చటనై యుండి। ప్రణుతిఁజేసిన నా

షఁగు నప్పాపకేందు॥ దివిజరూపంబు బలమున దృశ్యకగణ మరియు
పూర్వద్వారంబున॥ క ॥ మహారదనుజదమనుఁడు। వారణమునీం
ద్రనుతుఁడు కీర్తితశౌర్యా । ఖర్వాత్మ ఁడేకదంతుఁడు । ఉర్వీజన్నవ
రదుఁడుండు నుత్సేతమహిమ క్షత్రప్రదేశంబున కరిగి సాధకుండు॥సీ॥
వామతనుని ప్రాగ్ద్వారపాలుని దివ్యమునివంద్య నేనుఁగు మొగము వే
ల్పుగనుఁగొని వీరాగ్రగణ్యుండు సంతోషభరితుఁడై నిజభక్తిఁ బ్రస్తుతిం
చి । పత్రపుష్పంబుల వలనొప్పఁ బూజించిపక్వఫలంబు లర్పణముజే
సి।సామజవదనుని సన్నుతిగావించు దేవాదిదేవు మందిరముసొచ్చి। దరి
తసంహారు నభవుఁబ్రద్యోతమాన । పరమసంతోషతనుపరబ్రహ్మరూ
పు।హాటకేశ్వరదేవు నత్యంతభక్తి। గాంచిపూజించి వీరాగ్రగణ్యుఁడం
త॥క॥ఆదేవదేవుగుడిలోఁ।బాదుక సంజీవనీప్రపంచజవత్వా। పాదకఖ
డ్గామృతరస । వాదవయస్తంభమూలవర్గము లుండున్॥ మఱియు॥
(క) వలసిన వస్తువు లెల్లను।దలఁచిన వన్నియును వచ్చి తనసన్నిధికై।
నిలువఁ గల మూలికాదులు । తలఁపనగోచరము ద్రవ్యతండము లుం
డున్॥ (వ) అధిక తేజంబునం బ్రకాశింపుచున్న ద్రవ్యంబులు చూచి
హాటకేశ్వరదేవు ననుగ్రహంబువడసి వలసినమూలికాద్రవ్యంబులు గై
కొని యప్రతిమభావంబునఁ బ్రమథమహత్వంబు గలిగి విహరింపుచుండె
నంత॥ క॥ నీరజమిత్రుని తేజము। నీరజసంభవుని నేర్పు నిజకరబలమున్।
స్వారాజ్యవైభవంబును। సీరికిఁగైకొను నెవేల్పు శిరులుబ్బాదలన్॥ సీ॥
ఇవ్విధంబున సాధకుఁడేగుచీర। నిట్లుఇష్టార్థసిద్ధులు ఇచ్చునట్టి। యతివి
చిత్రంబులై నయుద్యానపుణ్య। వనశతంబున నీమహత్వంబుగల్గు॥క॥ ఈ
రీతినధిగమింపుచు। వీరాగ్రవరుండుగాంచు విశదంబునబ్బం। దారకదివి
జసంయుత।ద్వారంబునఁ గలుగుబద్మవతిబిలమునఁగన్॥ సీ॥ పాదకుండ

## —(*) పద్మవతీబిలప్రశంస. (*)—

చటుగ్గలోప్తిక్తి జపముఁజేసి।మంత్రనిష్ఠను ఘనధనుమూనధూమి। చనఁ

గఁ గాంచనశృంఖలాసహితమైన। కాంతిఁ జూపట్టు నొకభేరిఁ గాంచి నిలి
చి॥ (క) స్వర్ణమయదండమున భువి। ఘూర్ణిల్లఁగ భేరి బుగులుకొన
వాయింపన్। కర్ణముల మ్రోఁత సోఁకసు। వర్ణసకలాకలను బోలు వారి
జనయునన్॥ ఉభయ భాగంబులం గొలువ పద్మవతీకాంత యేతెంచెనం
త॥ (క) మారుసతి చకోరదనమును। దోరణకట్టంగఁ జాలు తొయ్యలి ర
మ్యా। కారంబును లావణ్యము। చీరికిఁ గైకొనని వేల్పు చెలువల సొబగున్॥
(సీ) మరువంపు దిమ్మయో మావిపూఁ గొమ్మయో మత్తచకోరమో మద
నుశరమొ। కందర్పదంతియో కల్పప్రూబంతియో కనకంపు దీఁగయో
కాంత బాగు। పోలఁతియో పచ్చకప్పురపుస్థలాకయో కోమలమాకారము
కొ్రమ్మయుం గో। రాజానురూపమో రత్నప్రదీపమో నెనయుంగ నల్లన
యభినుతింపఁ। గనకకంకణఝుణఝుణత్కారములను। రత్నకీలితనూపు
రారావములను। దంతకాంతులు చెకుటద్దములదీప్త। లంతకంతకు
నొండొండ నతిశయిల్ల॥ (క) ఎదురుకొని యతనిఁ దమపురి। సదనంబున
కరుగుమనుచు సయ్యాటములన్। ముదితలు దోడ్కొని చనిమణి। పదపీఠి
కనుంచి దేవభామినియంతన్॥ (క) ఆతనియూరును బేరును। నాతనిదా
ల్లియును దంష్ట్రి యభిధానము వి। ట్లాడ తనిచే వ్రాయించిన। నాతాళి
తపత్రమతివ యంగుళి నిడుచున్॥ (క) ఆయతివ యమృతతుల్యర। సా
యనమిచ్చినను గొనుచు సాధకుఁడును సౌ। ఖ్యాయత్తచిత్తుఁడై కొ
ని। ధీయుతసత్త్వమున దివ్యదేహముఁ బొందెన్॥ (వ) అంతఁ దనకు దే
వతాసత్త్వంబు సంభవించిన సత్త్వశౌర్యసామర్థ్యంబులు గలిగిన విజృం
భించె॥ (శా) పంకేజాసనముఖ్యులన్ దొరసి శుంభత్తేజుఁడై విక్రమా
లంకారప్రతిమప్రతాపమును నుల్లాసంబు సంధిల్లని। శ్శంకాలాపము
లాడుచున్ బలయశస్సామర్థ్యసమ్యక్క్రియా। హంకారంబునఁ బొంది
యాతఁడు గదాహస్తాబ్జముల్ చిమ్ముచున్॥ (ఉ) ఎక్కడి పాకశాస
నుఁడు నెక్కడి వహ్నిపరేతరాజు వీఁ। డెక్కడి రాక్షసేశ్వరుఁడు
నెక్కడి పాశధరాధినాథుఁ డిం। కెక్కడి యక్షనాయకుఁడు సన్ని

జగంబులు చేయఁద్రోవఁగా । నికరముసేనై కలఁనసి స్తుప్రోవ్న హంకరింపుచుణ్॥ (క) ఆలేమనగుచు నాతని। వ్రాల్చినను జిడివిఁ చ్చిన విధముణ్ । జాలించి తొలఁగి గర్వము। జాలించి యపాంధ్ము విం గులశాంతి వహించుణ్ ॥ (వ) వినయవివేకజ్ఞాన సత్వశౌర్యంబులును రూపలావణ్యవిలాసంబులును నిజదారత్వంబు గలుగుటకు అత్యంతసంతో షాయత్తచిత్తుండై॥ (క) ఆరాజముఖుల సంగడి। నారవిచంద్రాకణ మతులిత్తైశ్వర్యకళా। పారసుఖకేళి దేలుచు।వీరోత్తముఁ డుల్లసిల్లు వి భవాన్వితుఁడై॥ (క) తొమ్మిదికదళీవనములు।తొమ్మిపి పురములును న దులు దొమ్మిది బిలముల్।తొమ్మిది యమృతపుబావులు । తొమ్మండ్రు పురాధిపతులు దోబలయుక్తుల్॥ (గీ) కదళి మొదలైన దివ్యలింగస్థ లముల । గలిగి సురమును లచిరంతు రర్ధరాత్రి। సముచితంద న వే దఘోషములు చెలఁగఁ । బరమవిశ్వాసతాత్పర్యభక్తితోడ॥ (క) సం కులఘనాఘనధ్వని।శంకాద్యంకరణశంకజర్ఝరభేరీ । భాంకృతులు చె లఁగ నమరులు । శంకరుఁ బూజింపుదురు నిశాసమయమునన్॥ (క) శ్రీగిరిపుణ్యమహాత్మ్యము।వాగీశునకైన శేషవాసులకును ను।ద్యోగించియు న్నశక్యమె । శ్రీగిరినాయకుఁడు ఎఱుఁగుశివుఁడే యెఱుఁగున్ ॥ (సి) శ్రీగిరిపై జనశ్రేణుల లీలావిరాంబుల శ్వమేధాధ్వరములు । ఎవ్వఁడు గావించు నిష్టసల్లాపంబు మాహేశ్వరప్రోక్తమంత్ర మదియు । జనులు ఇచ్ఛాభోజనంబు చేయుట యంబికాధీశు సమర్పణములు । నిద్రావి హారంబు నీలలోహితపదధ్యానధారణమున మానసియతి । యిందు వ తించు లుబ్ధకు లమరవరులు। ఉదక మంతయుఁ బుణ్యగంగోదకంబు । సంతతంబును శ్రీగిరిజంతుహస్తి। వనరుహంబున సుందుఁడై వల్యలక్ష్మి॥ (క) సిరిగిరి నలుగడలందును। బరఁగిన శిలలెల్ల లోకపావనమహిమ । స్ఫురణమున నరుఁడు గోరిన।సిరు లొసఁగఁ జాలునట్టి శివలింగంబుల్॥ (శా) పాటింపన్ దగుమజ్జగంబులఁ బురప్రత్యర్థిఁబాటాటవీ। కోటీ కోటరపావనామరధునీ ఘనాదాకాంతరంగావళీ । త్యాటీకాయిత వేణు

శ్రీపర్వతపురాణము-షష్ఠమాశ్వాసము.

జన్మలతాలవిత్ర మని। బహుకర్మాంబుధిపటు పవిత్ర మని। భక్తజనుల్క హాపరసాధన మని। ముక్తికామికి ముఖదపఞాణ మని। అపమభక్తిసమ పఞాణ మిది యని। పరశువేదికిని భవనస్థల మని। చింతామణుల విచిత్రస్థ ల మని। సంజీవనులకు జన్మదేశ మని। సురమునివరులకు సుఖనివేశ మని। సకలామరులకు సన్నిధాన మని। లాలితభక్తికళావిధాన మని। తలంచు జ నుల సంతానకతరు వని। ప్రణుతార్థులకును పారుజాత మని। సేవకత తులకుఁ జింతామణి యని। కామితార్థులకుఁ గామధేను వని। తరశా ఖాంబుధితారక మిది యని। కరణయశోధనకారణ మిది యని। రచితకలు షకదంబశోషక మిది యని। మలహరుసేవకమంతన మిది యని। శివభక్తవ్ర జచింతన మిది యని। మోహవల్లికామోచనమిదియని। బహువిధకల్మష పావన మిది యని। భక్తావనవరభాగధేయ మని। గిరిశభక్తులకు గిరికల శం బని। సకలాఘాంబుదచయసమీర మని। గురుతరపాతకభుజగశారమ ని। అతులితశివధర్మావతార మని సకలమునీశ్వరజనవిహార మని। భావము లో నిది భక్తిఁ దలంచిన। సజ్జనపాదపజలనము శ్రీగిరి। ఘనపురాతనగా మణి శ్రీగిరి। సకలామరరత్నామణి శ్రీగిరి। సేవకమందరసేవధి శ్రీగిరి। శోభిత పుణ్యాయశోనిధి శ్రీగిరి। కారణజగదుపకారము శ్రీగిరి। ముఖ్యపుణ్యఫలమూ లము శ్రీగిరి। మాహేశ్వరజనమాన్యము శ్రీగిరి। శ్రీగిరిఁ దలఁచు విశేషజ్ఞ లకును। సప్తజన్మదోషము దొలఁగు నని। చాలను బలుకును సకలశ్రుతులు ను। ఇది శ్రీగిరిపతిహితసన్నిధి యని। యిది పఠియించిన నిహపరసుఖమని॥ అని స్తుతియించి యిట్లనియె॥ (గీ) ఎన్నిదానంబులవనిపై నెన్నఁ బడును। నెన్ని ధర్మంబు లవనిపై నెన్నఁ బడును । అవియు వేదోక్తముగఁజే యు నట్టి ఫలము। సంభవించును నీకథాశ్రవణమునను॥ అనుచు॥ (గీ) వలిన సంభవసుతుఁడు సనతుర-మారుఁ। ననుమతింపఁగను బరాశరాత్మజుండు। సకలమునులను సంతోషజలధిఁ దేల్చి। యుత్సవంబున వఠియింపుచుండిర ॥ (క) గీర్వాణశైలకన్యామణికి। అవాచీనస్వరూపమల్లభవాండా। వార్ష్మభరితహిమవ। త్పర్వతపుత్రీనిశాంగ పర్వతలింగా॥

మా లి నీ.

సుజనసురసహాయా శుద్ధలింగానుతేజా నిజకుశలసమాజా నిర్జితశ్రీతనూజా।వ్యజనభవవిభంగా వేదరంగత్తరంగా।జననిపుణగంగా పర్వతాధీశలింగా॥స్రగ్ధర॥ జంభాదిటుంటంభజాంభోజంభముఖదివిజస్వాంతనాళీకపద్మా । శుంభత్తుంటంభీనసేంద్రస్ఫుటకటకరసచ్ఛోభనాంఘ్రీవరద్మా।గంభీరాంభోధికన్యాఘనకుచయుగళీకాంతిమద్బాణగుప్తా। దంభావష్టంభమోహాతరవిభవమనస్థానకశ్రీగిరీశా॥

గద్యము॥ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్టభాషా
విశిష్ట శివయోగిగుణవర్య శేషనాథార్య ప్రణీ
తంబయిన శ్రీపర్వతపురాణంబునందుఁ
సర్వంబును షష్ఠమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీభ్రమరాంబా మల్లేశ్వరార్పణ మస్తు.

